భారతీయ సాహిత్య నిర్మాతలు

# బంకించంద్ర చటర్జీ

ఆంగ్ల మూలం

సుబోధచంద్ర సెన్‌గుప్త

తెలుగు అనువాదం

దేవులపల్లి రామానుజరావు



సాహిత్య అకాడెమీ

న్యూఢిల్లీ

*BANKIMCHANDRA CHATTERJEE* Telugu translation by D. Ramanuja Rao of S. C. Sengupta's English monograph. Sahitya Akademi, New Delhi, 1980, Price Rs. 2-50


*First Edition*: *1980*

*Copies available from* :
SAHITYA AKADEMI
Rabindra Bhavan, New Delhi-1

*Regional Offices*:
Madras-18, Calcutta-29 & Bombay-14

Published by Sahitya Akademi, New Delhi and Printed at Weldun Press, 68, Mannappa Mudali St., Madras-21.

# వి ష య సూ చి క

# తొ లి ప లు కు

(ఆధునిక) భారతీయ సాహిత్య నిర్మాతల్లో బంకిం చంద్రుని స్థానం అద్వితీయమైనది. ఆయన శతజయంతి ఉత్సవము 1938 లో జరిగినది. అయితే యీ శతజయంతి ఉత్సవాలు యీనాడు సర్వసాధారణమై, ఒక సభ్యతగా పరిణమించినవి. స్వల్ప ప్రతిభ కలిగిన రచయితలకు కూడ స్మారకోత్సవాలు జరుగుతున్నవి. బంకిం చంద్రుని తొలి నవల "దుర్గేశనందిని" శతవార్షికోత్సవము 1965 లో జరగడం ముఖ్యంగా గమనించదగిన విషయం. 'దుర్గేశనందిని' ప్రచురణ జరిగినప్పటినుండి బెంగాలీ,—ఆ మాటకొస్తే, ఆధునిక భారతీయ నవలల అనుసరించవలసిన మార్గాలను నిర్దేశించి పెట్టినది. అందువలన ఒక్క పుస్తకాన్ని మహిమాన్వితం చేయడం ఎవరికీ అసాధారణంగా, అసందర్భముగా కన్పించలేదు. 1865 లో పేర్కొనదగిన సృజనాత్మక రచనలు బెంగాలీవచన సాహిత్యంలో లేవు. 'దుర్గేశనందిని' ప్రత్యక్ష మయినది; ఒక్కసారిగా వంగనవలా సాహిత్యం పరిపక్వతను పొందినది.

ఇంతకు ముందు, మనం గొప్ప గ్రంథాల శతవార్షికోత్సవాలు—ఉదాహరణగా షేక్స్‌పియరు మొదటి ఫోలియో ప్రతి శతవార్షికోత్సవాలు జరగడం—విన్నాము. కాని ఒక్క గేయానికి యిటువంటి గౌరవం జరగడం ఎవరు విన్నారు? బంకించంద్రుడు తన 'ఆనందమఠం' నవలలో కూర్చిన 'వందేమాతరం' గేయ శతవార్షికోత్సవాలు దేశభక్తులు, కవితా, గానప్రియులు పలువిధాల జరపడం మనమిప్పుడు చూస్తున్నాము. అనేక భాషలు మాట్లాడే, పలు మతాల ననుసరించే, ఎన్నో ప్రాంతాలలో నివసించే జనులను ఏకం చేసి జాతీయతను ప్రసాదించినదీ, వారిని స్వాతంత్ర్య సాధనకై సంఘటిత పోరాటానికి ప్రోత్సహించినదీ, స్ఫూర్తి

నిచ్చినదీ ఈ గేయమే. ఇప్పుడా స్వాతంత్ర్యము వచ్చినది. కావున యికముందు బంకిం చంద్రుడు తన సృజనాత్మక, విమర్శనాత్మక రచనలలో చిత్రించిన, స్వతంత్ర దేశంలోనే సాధ్యమయ్యే ఆదర్శ జీవితం వైపు ప్రజలను నడపడానికి యీ గేయం స్ఫూర్తినిస్తూ వుంటుంది.

మనలను బెంగాలీ నాయకులవరకే సీమితం చేసుకుంటే భారతదేశ సాంస్కృతిక పునరుజ్జీవనం రెండు దశల్లో జరిగిందని చెప్పవచ్చును. మొదటి దశలో మార్గదర్శకుడు రామమోహనరాయ్, ఆయన మనలను ప్రాచీన వ్యాకరణ దాస్యం నుండి, నిష్ప్రయోజనమయిన తాత్త్విక సూక్ష్మతల నుండి, మూఢాచార ములనుండి విముక్తులను చేయ ప్రయత్నించినాడు; ఇక ముందుకు చూస్తూ ఈ ఉద్యమం మనలను పాశ్చాత్య హేతువాదంతో, విజ్ఞానంతో శృతిబద్ధం చేసినది. వెనుక, ముందులకు తారట్లాడిన రెండవదశ అతిగా సాగిన పాశ్చాత్యీకరణకు వ్యతిరేకంగా ప్రారంభమై 'ప్రాత క్రొత్తల మేలి కలయిక' కొరకు ప్రాచీన ఋషుల జ్ఞానం, అధునిక వైజ్ఞానిక, హేతువాద ఆలోచనా ప్రక్రియల సమ్మన్వయంపై ఆధారపడిన సమగ్ర జీవిత విధాన సాధనకై ముందుకు సాగినది. గీతలోని ఆస్తిక వాదమునూ అగస్ట్‌కోమ్ ఉపరిశోధనా సిద్ధాంతమును **(Positivism of Auguste Comte)** సమ్మేళనం చేసి సాంస్కృతిక మతాన్ని ప్రబోధించి, వ్యాఖ్యానించిన బంకిం చంద్రుడు యీ ఉద్యమ నిర్వాహకుడైనాడు.

సాహిత్యంలో బంకిం చంద్రుని కలం నుండి, శివుని జటాజూటం నుండి ఉద్ధృతంగా ప్రవహించిన గంగాస్రవంతివలె,* పూర్ణవికాసము పొందిన నవలా సాహిత్యం ఆవిర్భవించినది. వాటి ద్వారానేకాక, చాల భాగం 'వంగదర్శన్' పత్రికలో ప్రచురితమయిన వ్యాసాల ద్వార కూడ సృజనాత్మక రచనకు ఉత్తమ స్థాయిని నిర్ణయించినట్లే, సాహిత్యాభిరుచికి, సహృదయ విమర్శకూ ప్రామాణిక తను ఆయన నిర్దేశించినాడు. 'వంగదర్శన్' బెంగాలీలో మొదటి సాహిత్య పత్రిక కాకపోయినప్పటికి గుణములో అంతకుముందు వచ్చిన సాహిత్య పత్రికల నన్నిటినీ అధిగమించినది; ఆ తరువాత వచ్చిన పత్రికలలో దీనికి సాటివచ్చే

* శ్రీ సేన్‌గుప్తా 'Like Minerva from the head of Jove అన్న ఉపమానాన్ని వాడారు. అది తెలుగు నుడికారానికి సరిగ్గా అతకనందువలన పై విధంగా అనువదించడం జరిగినది.

—అనువాదకుడు

పత్రిక యేదీ లేదు. అనాసక్తత, బాహ్యప్రయోజనాల నాశించి కాక, తనకోసమై అలవరచుకొన్న ప్రామాణికత యీ పత్రిక ప్రత్యేకత. అంతేకాక సృజనాత్మక రచనలలో ఉన్నత ప్రమాణం, వ్యాసాల్లో, సమీక్షలలో నిర్దుష్టమైన పాండిత్యం, సరళశైలి, నిష్పాక్షికతలను యీ పత్రిక పాటించినది.

అటువంటి ఎన్నో కారణాలవలన బంకిం చంద్రుడు గొప్ప నవలాకారుడు గాను, వందేమాతరం సందేశాన్నందించిన ఋషియేగాక, సాహిత్య సమ్రాట్‌గా కూడ కీర్తి గాంచినాడు. భారతీయ మహోన్నతకవీ, బంకిం చంద్రుని కంటే ఎక్కువ సంఖ్యలో పుస్తకాలు వ్రాసిన రచయితా, బహుముఖ ప్రజ్ఞాశాలీ అయిన రవీంద్ర నాథ టాగూరుకు కూడ యీ బిరుదు లభించలేదు. బంకిం చంద్రుని నిర్యాణానంతరం పునరుద్ధరింపబడిన 'వంగదర్శన్' పత్రికకు కొంతకాలం టాగూరు సంపాదకుడుగా పని చేసినాడు. కాని 'వంగదర్శన్' ఆయన వదలి వెళ్ళిన ఖాళీని భర్తీ చేయలేక పోయినది.

ఈ సందర్భములో సాహిత్యనియంత (Great Cham) గా ప్రసిద్ధికెక్కి డాక్టరు జాన్సన్ ఒక్కడే ఈయనకు సమానుడుగా గోచరిస్తాడు. వారి మధ్యగల పోలికల, వ్యత్యాసాల అధ్యయనం విజ్ఞానదాయకంగా వుంటుంది. ఉత్కృష్ట భావనా సంపద కలిగిన బంకిం చంద్రుడు ఉన్నతశ్రేణి సృజనాత్మక రచనలను వదలి వెళ్ళినాడు. జాన్సన్ ముఖ్యసంపద ఆయన అసాధారణమైన ప్రపంచ జ్ఞానం; సృజనాత్మకం కాకపోయినా ఆయనకు శాశ్వతకీర్తిని ప్రసాదించే ఆయన సాహిత్యకృషి—ఆయన నిఘంటువు—ఆయన ప్రచురించిన షేక్స్పియరు ప్రతి; ఆయన 'కవుల జీవిత చరిత్ర' (Lives of the Poets) జీవిత చరిత్ర కన్న సాహిత్య విమర్శగా గణనీయమైనది. ఇద్దరి మధ్య యింత వ్యత్యాసం వున్నప్పటికీ, (బంకిం, జాన్సన్‌ను విమర్శిస్తాడు) యిద్దరూ జీవితం, సాహిత్యం పరస్పర సంబంధాలు కలిగినవిగా గుర్తించినారు; యిద్దరూ సరసమైన, సరియైన రచనకు, మంచి అభిరుచికి, సద్విమర్శకు స్థాయిని చేకూర్చినారు; యిద్దరూ భావనాత్మక రచనలను ఉన్నత జీవనానికి సహాయకారులుగా భావించినారు.

అంత గొప్ప వ్యక్తిని గూర్చి యింత చిన్న పుస్తకం వ్రాసినందుకు క్షమాపణలు చెప్పుకుంటు ముగిస్తున్నాను. ఈ రచయితకంటే దీని పరిమితులను గుర్తించినవారు పఠితలు వుండరు. నా పూర్వ విద్యార్థి, కలకత్తా ప్రెసిడెన్సీ

కళాశాలకు చెందిన ఆచార్య అశోక్ కుమార్ ముఖర్జీ జాగ్రత్త వహించక పోయి నట్లయితే దీనిలో లోపాలు యింకా స్పష్టమయి వుండేవి.

'వందే మాతరం'నకు శ్రీ అరవిందుల అనువాదం పునర్ముద్రించుటకై అనుమతి యొసంగిన పాండిచ్చేరి శ్రీ అరవిందాశ్రమం వారికీ, ఆపై యీ అనుమతిని నాకై సమయానికి సమకూర్చిపెట్టిన కలకత్తా నివాసి శ్రీ హెచ్. కె. నియోగికి నా కృతజ్ఞతలు.

సెప్టెంబరు, 1976. —సు చ. సేన్‌గుప్త

# 1

# ఉపోద్ఘాతం

వంగ సాహిత్య ప్రపంచములో బంకించంద్ర భానూదయ మయినది. సంధ్యా చీకటులు యింకా అలుముకునే వున్నవి; ఒక్కసారిగా క్షితిజములో సూర్యు డుదయించినాడు; జగత్తంతా వెలుగు వెల్లువలో మునిగిపోయినది. చైతన్య చిహ్నాలు ప్రతిఫలించినవి—ప్రకృతిలో, ప్రపంచములో. వంగ సాహిత్యంలో—యింకా చెప్పవలెనంటే భారతీయ సాహిత్యములోనే—అప్పుడు ఒక రకమైన జడత్వం వ్యాపించి ఉండెను. 1865 లో 'దుర్గేశనందిని' వెలువడి నది. ఆ తరువాత 'కపాలకుండల' యితర నవలలు వెలువడినవి. సాహిత్య ప్రపంచం తన సుదీర్ఘ సుషుప్తినుండి మేలుకొన్నది. ఆపైన త్వరితగతిలో 'వందే మాతరం' అందరి పెదవుల మీద ఆడినది.

అయితే యీ జాగృతి కనిపించినంత వేగవంతముగా జరిగినదా? బంకిం చంద్రుడు పుట్టినప్పటికాలం ఎన్నో అవకాశాలకు ఆస్కారం కలిగించేదిగా వున్నది. ఆంగ్లం రాజభాషగా, విద్యాలయాల్లో ముఖ్యవిషయంగా ప్రవేశపెట్టిన మూడు సంవత్సరాలకు జూన్ 26, 1836 న బంకిం చంద్రుడు జన్మించినాడు. 1865 లో కలకత్తా హిందూ కళాశాల, ప్రెసిడెన్సీ కాలేజీగా రూపొందినది; 1857 లో మూడు విశ్వవిద్యాలయాల స్థాపన జరిగినది. బంకిం చంద్రుడు కలకత్తా విశ్వ విద్యాలయంలో డిగ్రీ తీసుకున్న మొదటి పట్టభద్రుడు (1858). అప్పుడొక వ్యతిరేకోద్యమం మొదలయినది. ఈ ప్రభంజనం ఒకవైపు ఆంగ్లేయుల ఏలుబడికి వ్యతిరేకంగాను, మరొకవైపు పాశ్చాత్య జీవన, ఆలోచనా విధానాలకు వ్యతిరేకము గాను సాగినది. సిపాయి కలహం లేక స్వాతంత్ర్యోద్యమం (1857) లో యీ వ్యతిరేకత చిహ్నిత మయినది. 'కదలిక' మొదలయినది; ఆ చైతన్యమును సరియైన దిక్కుకు మళ్ళించి, వ్యక్తీకరించవలసిన వ్యక్తి బంకించంద్రుడైనాడు.

1858 లో డెప్యూటీ మేజిస్ట్రేటుగా బంకిం చంద్రుడు ప్రభుత్వరంగములో ప్రవేశించినాడు; అప్పటి వంగరాష్ట్రములో భాగాలయిన పశ్చిమ, ప్రాచ్య వంగాలు, ఒరిస్సాలోని చాల జిల్లాల్లో ఆయన పనిచేసినాడు; 1891 లో పదవీ విరమణ చేసినాడు. పాలనా వ్యవహారాలను మానవతాదృష్టితో, సమర్ధవంతముగా, దృఢత్వముతో నిర్వహించిన ప్రభుత్వాధికారిగా మంచి పేరు సంపాదించినాడు. పరాయిపాలన చేసిన కీడులలో ఒకటి—దేశీయుల తెలివి తేటలను ఉపయోగించే అవకాశం మృగ్యం గావటమని తన తరువాతి జీవితములో బంకిం చంద్రుడు విచారించినాడు. పదునెనిమిదవ శతాబ్ది మధ్యకాలములో భారతీయుడు అధిష్ఠించ తగిన పెద్ద పదవి వంగ ప్రభుత్వములో తాత్కాలిక సహాయ కార్యదర్శి మాత్రమే అని యీనాడు తెలుసుకుంటే బాధ కలుగుతుంది. 1891 లో బంకిం చంద్రుడు పదవీ విరమణ చేసినప్పటికి—అంటే భారత జాతీయ కాంగ్రెసు స్థాపించిన ఆరేండ్లకు వంగరాష్ట్రములోనే కాక, భారతదేశము మొత్తములో బంకిం చంద్రుడు విఖ్యాత సాహిత్యకారుడుగా పేరు పొందినాడు. అప్పటికి ఆయన రచనలు కొన్ని ఆంగ్లం, యింకా తదితర భాషల్లో పరివర్తితమైనవి. అయితే శ్రమించి సంపాదించిన యీ విశ్రాంతిని అనుభవించే అవకాశం ఆయన కెక్కువ కాలం లేకపోయినది. పదవీ విరమణ కాలానికే ఆయన ఆరోగ్యం దెబ్బతిన్నది. 1894 ఆరంభంలోనే ఆయన తీవ్రంగా జబ్బుపడినాడు. ఆ సంవత్సరం ఏప్రిల్ 8 న పరమపదించినాడు.

బంకిం చంద్రుని సాహిత్యకృషిని—పదునాలుగు నవలలు (మరొకటి ఆంగ్లములో) యింకా కొన్ని వివిధ వచన రచనా సంకలనాలు (పద్యగ్రంథాలను వదలివేస్తే)—రెండు లేక మూడు దశలుగా విభజింపవచ్చును. శ్రీ అరవిందులు ఆయన తొలి రచనలకు, తరువాతి రచనలకు గల భేదాన్ని యిట్లా తెలిపినాడు—"తొలి దశలో బంకిం చంద్రుడు కవీ, శైలిలో ఆడంబరత సాధించిన రచయిత. తరువాతి దశలో బంకిం చంద్రుడు ఋషిగా, జాతి నిర్మాతగా దర్శనమిస్తాడు." మరి కొంత మందికి ఆయన తరువాత రచనల్లో సృజనాత్మక శక్తి క్రమక్రమ పతనమూ తొలి రచనల్లో అప్రతిమాన ప్రతిభా దృగ్గోచరమయినవి. అయితే మేధావి అయిన రచయిత యొక్క సమస్త రచనల సమష్టి పరిశీలనే ఆ రచయితను ఆవిష్కరిస్తుంది. "మంచి కథే ఓ నీతి అయితే, చెడు కథకో నీతి వుంటుంది"—అనే చస్టర్టన్ విరోధాభాసాన్ని (Parodox) మనం మర్చిపోకూడదు. ఆయన యవ్వన ప్రాదుర్భావంలోని తొలి నవలలు కొన్ని, చివరి దశలోని వ్యాసాలు

నవలల చర్చ కాలక్రమగతిని మార్చడమవుతుంది. ఆయన చిరకాలం నిలిచి పోయే నవలల నట్లావుంచి, బంకిం చంద్రుని ఆలోచనా సరళి ముందు చర్చిద్దాం.

పందొమ్మిదో శతాబ్దములో రాజారామ మోహనరాయ్ జాతి జీవనానికి మేల్కొలుపు పాడి వైతాళికుడు అయినాడు. ఆ జాగృతినే వంగ సాంస్కృతిక పునరుజ్జీవనంగా లేక భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనంగా వర్ణించడం జరిగినది. కాని యీ వర్ణన అసమంజస మనిపిస్తుంది. 1453 లో కాన్‌స్టాంట్ నోపిలు పతనమయిన తరువాత పశ్చిమ దేశాలకు పారిపోయిన ప్రామాణిక పండితుల ప్రభావాన్ని అతిశయోక్తులతో గానం చేసినప్పటికీ, తిరిగి ప్రాచీన గ్రీకుగ్రంథ పరనం ఐరోపా సాంస్కృతిక పునరుజ్జీవనానికి జీవం ప్రసాదించిన దనడంలో సందేహం లేదు. ఇది ముఖ్యంగా ప్రాచీన సంస్కృతి పునర్దర్శనం మాత్రమే. అధునాతన విదేశీ సంస్కృతుల సంపర్క ప్రభావంతో మన సమాజ వ్యవస్థ, జీవన విధానం, సాహిత్యంపట్ల మనకున్న విశ్వాసాలు ఒక్కసారిగా సడలి నట్లయితే అది పునరుజ్జీవనమనిపించుకుంటుంది. భారతదేశంలో జరిగిన జాగృతి యిటువంటిది కాదు. అందువల్ల మొదటనుండి ప్రాతక్రొత్తల, దేశీయ విదేశీయ శక్తుల మధ్య స్పర్ధ రగులుకొన్నది. రాజారామ్ మోహనరాయ్ ప్రభుత్వ సంస్కృత కళాశాల స్థాపనను వ్యతిరేకించినాడు. ఆయన ఉద్దేశం—అది మూఢ నమ్మకాలకు ఆలయ మవుతుందని. అయితే ఒక ఆశ్చర్యకరమైన సంఘటన జరిగినది. కళాశాల స్థాపితమైనది; అక్కడ సుశిక్షితుడై వెలువడిన పండిత ఈశ్వరచంద్ర విద్యా సాగరుడు పాశ్చాత్య మనస్తత్వం కలిగిన ఛాందస బ్రాహ్మణుడు. ఆయన తన అపార పాండిత్యాన్ని తన అధునాతన సంస్కారోద్యమ సమర్థనంకోసం వాడు కొన్నాడు. క్రైస్తవ మిషనరీలు ఎన్నో మతాంతరీకరణ ప్రయత్నాలు చేసినవి. అయినప్పటికీ యింకో కొత్త మతం బ్రాహ్మమతం (Brahmoism) ఉద్భ వించినది. ఈ క్రొత్త మతం క్రైస్తవ ఏకేశ్వరవాదం (Unitarianism) ఇస్లాం లకు కొంత ఋణపడిందనే చెప్పవలెను. అయితే పేరులోనే వున్నట్లు ఇవి ఉప నిషత్తులు, అద్వైత వేదాంతంలో వ్రేళ్ళూని పెరిగినది. హిందూ ఆలోచనా సరళి బ్రాహ్మమతమును క్రొత్త మార్గాలు పట్టించినది కాని, హిందూ సమాజం కులవ్యవస్థను రూపుమాపుకోలేకపోయినది; అనేక దేవతా ఉపాసనను (Polytheism) మానుకోలేక పోయినది.

ఈ పూర్వరంగములో బంకిం చంద్రుని ఆలోచనా ప్రక్రియను మనం పరిశీలించవలసి ఉంటుంది. ఎంతవరకిది అనేక సంస్కృతుల సమ్మేళనం? ఎంతవరకది సంయోగ తాత్త్వికత? ఈయన ఆలోచనా సరళి వివిధ దర్శనాల నుండి గ్రహింపబడినదన్న అభియోగం ఎంతవరకు సమంజసం? ఈ విషయాలను మన మిప్పుడు చర్చించవలెను. ఆయన రచనలన్నిటిలోను ఒక మూల సూత్రం వున్నది. ఆత్మసంయమనమే ఆనందౌన్నత్యాలకు మూలకారణమన్న సిద్ధాంతం ఆయన పదే పదే చెప్పినాడు. శశిశేఖర భట్టాచార్యుడు నీతినియమాల్లేని యువకుడు. అతని ప్రాథమిక వృత్తి జారజుల (bastards) పుట్టించడమే; అయితే బంకిం చంద్రుని తొలినవల 'దుర్గేశనందిని' కథ మొదలయేటప్పటికి, శశిశేఖరుడు ఒక సన్యాసిగా, కోరికలపై సంపూర్ణ విజయం సాధించిన ఋషిగా మనకు గోచరిస్తాడు. ఆయన రెండో నవల 'కపాలకుండల'లో మాటీ బీబీ ఆనందానికి అఱ్ఱులు చాచే ఆడది; తనను పుష్పమకరందాన్ని గ్రోలే భృంగిగా భావించుకొనేది; అయితే ఎన్నో సంవత్సరాల తరువాత విడిపోయిన భర్తను కలుసుకొన్న మాటీ బీబీ, భర్త ప్రేమలో తలమునకలయినది; తన ఆనందపు వేట ఎంత నిరర్థకమయినదో ఆమె కవగతమయినది. ఆయన నాలుగో నవల 'విషవృక్షం' ఆత్మసంయమనం ప్రబోధించడానికే వ్రాసినట్లు కనబడుతుంది. ఆయన తుది రచనల్లో (నవలలు, వ్యాసాలు) ప్రామాణిక గ్రంథాల ఉటంకింపులు పరిశీలించితే, ఆత్మసంయమనమే ఆయన మన కందించే సందేశంగా గోచరిస్తుంది.

అందువల్ల బంకిం చంద్రుడు కవి నుండి దార్శనికుడుగా, నీతివేత్తగా పెరిగినాడనడం అసమంజసం. నీతి సందేశం ఆయన రచనల్లో క్రమంగా కర్కశంగా ధ్వనించవచ్చును; సృజనాత్మకశక్తి అక్కడక్కడా దెబ్బతిన్నట్లు అనిపించవచ్చును; అయితే ఆయన రచనల్లో ఔన్నత్యం—దాన్ని ఔన్నత్యమని పిలిచేటట్లయితే—క్రమ పరిణామంలో సాగినట్లు గోచరిస్తుంది. సుఖలబ్ధి ఆత్మసంయమనం వల్లనే కాని, ఇంద్రియలోలత్వం వలన సమకూడదు. అయితే సంయమనం నివృత్తిసిద్ధి (Negative accomplishment) మాత్రమే. ఉన్నతాశయం లేని సంయమనం ఆత్మవినాశనానికి దారి తీస్తుంది, జీవిత గుణం శూన్యమవుతుంది. కాని జీవితం సంపూర్ణ వికసనాన్ని కోరుతుంది; అనేక వృత్తుల కళ్యాణకృతి

అది పూర్ణవికాసం పొందవలెను. బంకిం చంద్రుడు డార్విన్, హిర్బర్ట్, స్పెన్సరు రచనలను చదివినాడు.* అయితే ఆయన తాత్త్వికతను పరిణామ సిద్ధాంతము లోని మూలసూత్రాలతో మాత్రమే జోడించవలసి ఉంటుంది. జీవితం అనేది పూర్ణవికాస సిద్ధికై సాగే అనితర సాధన—యిది మానవ శారీరక, మేధో, రసాత్మక శక్తుల సుసామరస్యయుత క్రమావిర్భావ జనిత ఫలం. "మతంలో వున్న విషయం సంస్కృతి, దాని ఫలం ఉన్నత జీవనం" అన్నాడు సీలే. బంకిం చంద్రుడు తన చివరి నవల కంటె ముందుదైన 'దేవి చౌధరాణి'కి సూక్తిగా పై వాక్యాన్ని వాడుకొన్నాడు.

బంకిం చంద్రుడు శ్రీకృష్ణుని కథకు తన సొంత వ్యాఖ్యానం చేసినాడు. ఆయన శ్రీకృష్ణుడు భగవదవతారం కాదు—మనుషులలో మనీషి. ఈ విధంగా ఆయన ప్రాచ్య పాశ్చాత్య ఆలోచనా ప్రక్రియలకు పాక్షిక సమన్వయం కుదిర్చినాడు. సాంస్కృతీ మత సిద్ధాంతం పాశ్చాత్య తాత్త్విక శాస్త్రం నుండి తీసుకొన్నాడు—అయితే యీ సిద్ధాంతం మూర్తిమంతమయింది ప్రాచ్యంలో—మహాభారత శ్రీకృష్ణునిలో—అని ఆయన కనిపించినది. కాలగతిలో శ్రీకృష్ణ కథ సంతరించుకొన్న రెండవ, మూడవ పొరలను తొలగించి 'మహాభారతం'లో కన్పించే అసలు శ్రీకృష్ణుని దర్శింప యత్నించినాడు బంకిం చంద్రుడు. ఆయన ప్రయత్నం మొత్తం మీద సఫలీకృతం కాలేదు. ఈ శ్రీకృష్ణుడు మానవునివలె కాక, ఒక భావం మూర్తిమంతమయినట్లు కనిపించును. ఈ శ్రీకృష్ణుడు మానవత్వం లోపించిన ఓ చిహ్నం—అన్న రవీంద్రనాథ ఠాగూరు విమర్శ సరియైనది. అయితే యిక్కడ మన దృష్టి భావం పైనేగాని, అందంగా చిత్రించిన ఆ పాత్రపైన కాదు. బంకిం చంద్రుడు 'మహాభారతం'లోని శ్రీకృష్ణుని కథలో మూడు పొరలూ విడదీసే ప్రయత్నం చేసినాడు. మూడు పొరలూ 'మహా

---

* పరమానందమే జీవిత లక్ష్యమనీ, అంతర్బాహ్యస్థితుల కెల్లప్పుడూ సర్దుబాటు చేసుకునే అవసరం వున్నదనీ బంకిం చంద్రుడు పదే పదే చెప్పడంలో ఆయన చేసిన నిమ్నోన్నతాలతోకూడిన వివిధ అనుభూతుల మధ్య వివక్షణలో—ఆయన అనుభవాలకూ, స్పెన్సరు నీతి సూత్రాలకు గల అవినాభావ సంబంధం దృగ్గోచరమవుతుంది. అయితే స్పెన్సరు వీటిని 1892-93 దాక పూర్తిగా వ్యక్తీకరించలేదు. అప్పటికి బంకిం చంద్రుని రచనా వ్యాసంగం పూర్తి అయినది.

భారతం'లో వున్నవి. మొదటి దశలో శ్రీకృష్ణుడు మానవునిగా చరిస్తాడు—దేవుడన్న స్పృహే కలుగదు మనకు. తరువాత ముఖ్యంగా 'భాగవతం'లో శ్రీకృష్ణుడు భగవదవతారంగా దర్శనమిచ్చును. ఈ దశలో ఆయన ఒక తాత్త్విక సిద్ధాంతం రూపుకట్టినట్లు గోచరిస్తాడు. ఆ తరువాత శ్రీకృష్ణుడు వైష్ణవ దైవంగా కనిపిస్తాడు. ఇక్కడ ఆయన ప్రేమకు చిహ్నం—ఎన్నో ప్రేమ కథలు అల్లుకున్నవి, ఆయన ప్రేమచుట్టూ. శ్రీ కృష్ణ కథలోని అసలు పొర 'మహాభారతం' లోనిది. అంటూ బంకించంద్రుడు అక్కడ కృష్ణుని పరిపూర్ణ మానవునిగా దర్శిస్తాడు. ఈ శ్రీకృష్ణుడు మానవ సాధ్యాలైన శారీరక, మేధో, రసాత్మక, నైతిక శక్తులు పొందిన సిద్ధుడు. ఈ పరిపూర్ణవ్యక్తి 'మహాభారత' కథల్లో — ముఖ్యంగా కురు పాండవ సంగ్రామంలో ఉత్సాహంగా పాల్గొంటాడు.

అయితే ధర్మక్షేత్రమయిన ఈ కురుక్షేత్రంలో శ్రీకృష్ణుని ఉద్దేశం, ఆదర్శం ఏమిటి? బంకిం చంద్రుని దృష్టిలో ఆనాడు భారతదేశం తమలోతాము కీచులాడుకొనే ఎన్నో భిన్న రాజ్యాలుగా ముక్కలు ముక్కలయి వుండినది. అందువల్ల ఏకచ్ఛత్ర పాలన క్రిందకు వచ్చేవరకూ భారతావనికి ఎటువంటి శాంతి, పురోగతి లేదు. ఈ అంతిమ లక్ష్యసాధనకై భిన్న భిన్న రాజ్యాల వినాశనం జరగాలె. చిన్న రాజుల వినాశనానికై సుదీర్ఘంగా సాగిన ఆ యుద్ధపు మూలకారణమిది. ఈకథలో చరిత్రకు సంబంధించిన భాగం ఊహాకల్పితమే. అయితే యిక్కడ మనం చరిత్ర కంటె బంకించంద్రుని తాత్త్విక దృష్టిని గమనించాలె. ఇక్కడా, మరెన్నో చోట్లలో వలె, బంకిం చంద్రుడు విధ్యుక్త ధర్మాన్ని గురించి చెప్పినాడు. కురుక్షేత్రంలో జరిగిన విధ్వంస నాటకానికి శ్రీ కృష్ణుడు ప్రేక్షకుడు. దాన్ని ఆపడానికి ఆయన పెద్ద ప్రయత్నమేమీ చేయలేదు. పైగా ఈ విధ్వంసకాండను సమర్థిస్తాడు. ఎందుకు? బంకించంద్రుడు అంటాడు — ధర్మస్థాపన గాలిలో పుట్టే విషయం కాదు. పరిస్థితుల ప్రభావంతో సాధ్యమవుతుంది. ఆధునికులనుకునే సామాజిక, ఆర్థిక శక్తులవల్ల ఒనగూడుతుంది. భగవదవతారంగాకాక, మానవునిగా శ్రీ కృష్ణునికి తాను చూసిన పరిస్థితుల్లో భారతావని శాంతి, పురోగాముల సాధనకు మార్గం ఒకటే కన్పించింది — అదే విధ్వంసం. అందువల్ల శ్రీ కృష్ణుని, అర్జునుని విధ్యుక్త ధర్మం విధ్వంసకాండ పూర్తి చేయడం — ఆపైన నవజీవనం సృజింపబడుతుంది.

ఇక్కడ బంకించంద్రుని ఆలోచనల్లోగల మితవాద తత్త్వానికి మూలం మనకు కన్పిస్తుంది. ధర్మ నిర్ణయం ఒక తత్త్వశాస్త్రానుసారంగా గాని, మానవహిత

ప్రేరణవలన గాని జరుగదు. మనం వున్న పరిస్థితులు, సామాజిక కట్టుబాట్లనుండి మాత్రమే అది ప్రభవిస్తుంది. కృష్ణుని కంట గట్టిన అనేక వివాహాల ప్రసక్తి వచ్చి నప్పుడు బంకిం చంద్రుడు యిదే వ్యాఖ్యానం చేసినాడు. ఈ కథలో ఆయనకు చాల అతిశయోక్తి కనిపించినది. 'మహాభారత' కథ మొదటి పొరలో శ్రీ కృష్ణునికి ఒకరికంటే ఎక్కువమంది భార్యలున్నట్లు నిరూపిత మైనప్పటికి, శ్రీ కృష్ణుని మనం తప్పుపట్టవలసిన అవసరం లేదు. ఎందువల్లనంటే అది ఆకాలపు ఆచారం. ఈ కారణంగానే మలబారివంటి సంఘ సంస్కర్తలను బంకిం చంద్రుడు దుయ్యబట్టడం జరిగినది. అయితే ఆయన బహుభార్యత్వాన్ని, ఇతర సాంఘిక దురన్యాయాలను అంగీకరించినాడని కాదు. ఇది నైతిక, రాజకీయ చైతన్యం ద్వార సాధించవలసిన విషయమనీ, అప్పుడు సాంఘిక దురన్యాయాలు వాటంతటవే మాయమవుతవనీ ఆయన భావించినాడు. ఈసిద్ధాంత ప్రాతిపదికపై వాదిస్తూన్న బంకిం చంద్రునకు ఈశ్వరచంద్ర విద్యాసాగరుని ఉద్ధృత సంస్కారోద్యమంలో విదూషకత్వం గోచరించింది.

బంకించంద్రుడు 'ధర్మతత్త్వము', యింకా తదితర రచనల్లో 'మహాభారత' శ్రీ కృష్ణుని సాహితీమూర్తిగా దర్శించినాడు. అయితే యీ శ్రీ కృష్ణుడు చాల తెలివిగల అవకాశవాదిగా, ఏ విషయాన్నైనా, ఎవరికైనా తన లక్ష్యసాధనకు ఉపకరణాలుగా వాడుకునే వానివలె కనిపించును. తమ ప్రాపంచిక లక్ష్యాల సాధనే సహజగుణంగా కన్పించే బెర్నార్డ్‌షా, సీజరు, బ్లన్ ట్చ్‌లీ పాత్రలను గుర్తుకు తెస్తాడు యీశ్రీకృష్ణుడు. కాని ప్రాపంచిక విజయమే మన అంతిమ సాధ్యంగా బంకిం చంద్రు డెక్కడా ప్రస్తావించలేదు. ప్రతిచర్య ఒకే ఒక్క లక్ష్యానికి లోనయి వర్తించవలసి వుంటుంది. ఆ లక్ష్యమే సర్వజనశ్రేయం — సర్వప్రాణుల శ్రేయం, సర్వ సృష్టికి శ్రీ కృష్ణుని అధినాథునిగా మనం దర్శించితే, ఆయన అందులో అంతస్థుడయి వున్నట్లుగాకూడ మనం గుర్తించవలసి ఉంటుంది. అప్పుడు మానవసేవే, మాధవసేవ అవుతుంది. బంకించంద్రుడు రాజకీయ తత్త్వశాస్త్రజ్ఞుడు. ఆంగ్లేయ పరిపాలనా సమర్థకులూ, విప్లవకారులూ అందువలననే ఆయనను ప్రామాణికునిగా స్వీకరించడం జరిగినది. అయితే ఆయన రాజకీయ తాత్త్వికతలో ఎటువంటి ఘర్షణ **(Contradiction)** లేదు. ప్రజల సంపూర్ణమయిన, సామరస్యయుతమయిన ప్రగతికి అవకాశాలు కల్పించడానికే ప్రభుత్వాలు. ఈ అవకాశాలున్నప్పుడు పరాయిపాలన అంత చెడ్డదేమీ కాదు — అసలు చెడ్డదే కాదేమో. వంగ రాష్ట్రంలో మొగలాయి, పఠానుల పరిపాలనలను బంకించంద్రుడు పోలుస్తాడు. పరి

పాలకులుగా మొగలాయీలు పఠానులకంటే సమర్థులే కాని, వారు దేశీయ మేధావు లను ప్రోత్సహించలేదు. కాని నవ్యన్యాయము, వైష్ణవ తాత్త్వికత — యింకా ఎన్నో వంగదేశ హిందూ సాంస్కృతిక పునరుజ్జీవనంలో ప్రభవించిన అవకాశాలు పఠానుల పాలనలోనే సాధ్యమయినవి. వారు దేశీయులకా అవకాశాన్ని కల్పించి నారు. భారతదేశంలోని ఆంగ్లప్రభుత్వాన్నయినా - ఆమాటకొస్తే ఏ ప్రభుత్వా న్నయినా, అది దేశీయమైనా. విదేశీయమైనా, యీ ప్రామాణికత ఆధారంగా విలువ కట్టవలసి వుంటుంది.

ప్రజా శ్రేయస్సంటే ఏ కొద్దిమందికో — రఘునాథ శిరోమణి లేదా రఘు నందన లేదా శ్రీ చైతన్య వంటి మేధావుల కవకాశం కల్పించడం కాదు. గొప్ప వాళ్ళైనా, కొద్దివాళ్ళైనా, ధనికులైనా, పేదలైనా అందరి హక్కుల, అవకాశాల పరిరక్షణే సర్వజన శ్రేయస్సు ఇక్కడ బంకిం చంద్రుని ఆలోచనా స్రవంతిలోని రెండవ అంచు - ఆయన విప్లవాత్మక ఆదర్శవాదం మనకు దృగ్గోచరమవుతుంది. ఈయన సర్వజన సమానత్వం కాంక్షించిన వ్యక్తి. అయితే యీ సమానత్వములో అన్ని భేదాలు సమసిపోవలెననీ ఆయన ఉద్దేశం కాదు. బర్క్ సామెతను త్రిప్పి చదివితే — ఈయన దృష్టిలో సమానం చేయడం అంటే చదునుచేయటం కాదు. ట్రయిలస్ అండ్ క్రిస్సిడాలో యులిసిస్ అన్నట్లు అంతస్థుల తేడా లుండాలె. ప్రభుత్వం, సమాజ వ్యవస్థ అందరి హక్కులను పరిరక్షించేవిగా, సమాన అవకాశా లను కల్పించేవిగా వుండాలె. షా, ఆల్ఫ్రెడ్ డూలిటిల్‌లా, బంకిం చంద్రుని కమలాకాంతుడు, అతని జాలికర్హులు కాని బీదవారి పక్షాన వాదించే వ్యక్తివలె కనిపించును. కమలాకాంతుని పిల్లి అంటుంది — "నీ పాలను తాగినానని కొట్టి నావు, అదే ఓ పెద్దమనిషి - ఓ పండితుడు త్రాగితే సంతోషించేవాడివి. ఎందు కని ? నేనేం తక్కువ ఆకలితో బాధపడుతున్నానా ?" ఈ ఆలోచనతో ఉత్తేజితు డైన బంకిం చంద్రుడు క్రిందటి శతాబ్ది ఏడు పదుల్లోనే పర్మినెంటు సెటిల్మెంటు రద్దుచేయవలెననీ, భూమిదున్నేవారికి ఆభూమి పంచిపెట్టవలెననీ వాదించినాడు.

ఇక్కడో ప్రశ్న ఉద్భవిస్తుంది. నైతికతకు ఆధారభూతాలయిన ఆత్మసంయ మనం, మానవ సేవలకు ప్రోత్సాహం యిచ్చే ఆశక్తి యేది ? బంకిం చంద్రుడు ఆస్తికుడు. ఆయన దృష్టిలో భగవదస్తిత్వం మొదటనే అంగీకరించనపుడు యిట్టు వంటి చర్చకు, వాదనకు ఆస్కారం లేదు. ఆయన తన వాదనా పద్ధతులను, కొన్ని చోట్ల విషయాన్నికూడ, పదునెనిమిదవ శతాబ్దపు ఐరోపీయ తాత్త్వికులనుండి- సర్వజనోపయోగితావాదం (Utilitarianism) ఉపలోభనా-సిద్ధాంతం (Prol-

tivism) ల నుండి గ్రహించినాడు. అయినా ఆయన ఈ నాస్తిక సిద్ధాంతాలను ప్రతీకరించినాడు. 'మిల్' ప్రభావంతో వ్రాసిన కొన్ని వ్యాసాలను ప్రచురించ లేదు. కమలాకాంతుని ద్వారా సర్వజనోపయోగితా వాదాన్ని, తిండిపోతు సిద్ధాంతంగా వ్యంగీకరించినాడు. సమస్త కార్యాలను రామార్పణం చేయవలెనన్నాడు బంకిం చంద్రుడు. 'ఆనందమఠా'నికి వ్రాసిన తొలిపలుకుల్లో, భక్తిహీన ప్రాణ త్యాగంకూడా ఎందుకూ కొరగాదని వ్రాసినాడు. ఈ విషయంలో అసందిగ్ధతకూ చర్చకూ అవకాశమివ్వలేదు. భగవంతుడు సర్వవ్యాపకుడు, ఆయన మన సర్వ కార్యాలను పరిశీలించే అధికారి, న్యాయమూర్తి అని గుర్తుంచుకొన్నప్పుడు, మనం మానవుణ్ణి, ప్రపంచాన్ని నిజంగా ప్రేమించడం మొదలెట్టుతాము; అప్పుడే మనం చేసే పనులన్నీ స్వార్థరహితంగా వుంటవి. పైన భగవంతుడున్నాడన్న స్పృహ ప్రపంచంలో, సర్వకార్యాలను చక్కదిద్దుతుంది. బంకిం చంద్రుని తాత్త్వికతలో యీ దృష్టి హేతువాద జనితమైనది కాదు. కొంతమంది వేదాంతాలు దీన్నే కర్మ సిద్ధాంతము (Voluntarism) అన్నారు. "కొన్ని విషయాలు మనలను ఎదుర్కొన్నప్పుడు అనుభవంతో సంపాదించిన సత్యాలపై నిర్ధారించి అంగీక రించనూ తిరస్కరించనూ లేనిపరిస్థితిలో, మనం వాటిని పాటించడానికి నిర్ణయించు కోవడాన్ని" కర్మసిద్ధాంతమంటారు. ఆయనలో ఈ భావన ఒకసారి కలిగిన తరువాత, బంకిం చంద్రుడు తీవ్రతార్కికుడుగా కన్పిస్తాడు. తన వాదాన్ని వర్తమాన సత్యాలు, గతించిన చారిత్రకాధారాలతో ఋజువుపర్చ సిద్ధపడతాడు.

అయితే మానవతపట్ల ప్రేమ, మతపరమైన భక్తి సర్వజన శ్రేయ స్సాధనకు తప్పక సూచీపడుతుందనీ, నిశ్చయంగా దారి చూపుతుందనీ ఎట్లా చెప్పగలం? ప్రజల్ని క్రూరంగా బాధించిన వ్యక్తులు కొంతమంది, తామూ పని భగవంతుని కార్యంగా భావించి చేసినారని బంకిం చంద్రుడు అన్నాడు. అయితే నిజమైన భక్తునికీ, మత దురభిమానికీ లేదా ఆదర్శవాదికీ, ఉన్మాదికి మధ్యగల అంతరం ఎవడు గుర్తించగలడు? ఆపైన ప్రజాశ్రేయస్సే తమ ఆశయంగా చెప్పుకొన్న పెద్దలు మత దురభిమానులకంటె ఎక్కువ దారుణకాండలే జరిపినారు. లక్షలకొలది జనాన్ని మట్టుపెట్టినారు. తరువాత బంకించంద్రుడు తన వాదన కొనసాగించినప్పటికీ, ఈ ఆక్షేపణలకు ఆయన సమాధానం యీ విధంగా కనబడుతుంది. ప్రజాశ్రేయస్సే తమ ఆశయం అని మాటల్లో చెప్పడమే కాక, వారి హక్కులను గుర్తించడం—రాముపంటి చేపలుపట్టే వాడి హక్కు, హషిమ్ షేక్, పూరన్ మండల్‌వంటి భూమి దున్నేవారి హక్కులను గుర్తించడం-

ప్రభుత్వ సామర్థ్యానికి ఆధారంగా, గీటురాయిగా వుండాలె. జాతి భవితవ్యానికీ, మేహా వికాసనానికీ తప్పని హామీ, సిసలైన పునాది యిది మాత్రమే కాగలదు. ఈ విధంగా బంకిం చంద్రుడు చాల విషయాల్లో మితవాది ఐనప్పటికీ, అధునా తన సామ్యవాదానికి మార్గదర్శి అయినాడు.

'ఆనంద మఠం' ప్రముఖంగా ప్రజాభిప్రాయాలను వ్యక్తీకరించే గొప్ప రాజకీయ నవల. సన్యాసులు ప్రపంచ పరిత్యాగం చేసినారు. అయితే వారు ప్రజలతోనే వున్నారు. వారి కోసం పని చేసినారు, ప్రజలే వారైనారు. బాహ్య ప్రేరణ లేకుండానే ప్రజల బాధలు వారి ఉద్యమంలో చోటు చేసుకొన్నవి; వారు స్వదేశీ ఉద్యమాన్ని బలపరచిన నిజమైన నాయకులు. కారణం వారు సంతానులు (కొండజాతివారు)—భూమి బిడ్డలు. అయితే యీ దండయాత్ర మహమ్మదీయుల మీదా, బ్రిటీషువారి పాలన మీదా అన్న వివాదం అర్థంలేనిది. సన్యాసులు సమర్థవంతంగా పరిపాలించలేని బలహీన మహమ్మదీయ పాలకుల నెదిరించి నారు; ఆంగ్లేయులను వ్యతిరేకించినారు. ఆంగ్లేయులను హింసాయుత మార్గంలో పారదోలవలెననే చాల మంది దేశభక్తులకు ఆనందమఠం భగవద్గీతవలె (బైబిలు వలె) పఠనీయ గ్రంథమైంది. దేశకాలాలకు అతీతంగా ప్రజాహక్కులకై జరిగే పోరాటాలన్నిటికీ స్ఫూర్తి నివ్వాలె. "ముందుకు దుమికే యువతా ప్రవాహాన్నెవ రాపగలరు ?'' పాడతాడొక సన్యాసి అన్ని కాలాల్లోని యువకులకూ, యువతు లకూ స్ఫూర్తి నిచ్చే పిలుపిది.

భారతీయ సాహిత్యసంపదలో మణిపూస అయిన 'వందే మాతరం' గేయాన్ని యీ దృక్పథంతో పరిశీలిస్తే సరిగ్గా అర్థం చేసుకోగలం. బంకిం చంద్రుని మేధాసంపద అంతా యిక్కడే కేంద్రీకృత మయినది—ప్రేమ గీతంగా వెలువడినది. సుజల పూరితమైన, సుఫల పూర్ణమయిన, సస్యశ్యామలమైన మాతృ భూమికి వందన మర్పించినాడు కవి. ఆమె మాతృభూమియే కాదు దివ్యభూమి. బంకిం చంద్రుడు హిందూదేవగణంలోని చాల మంది దేవతల—దుర్గ, లక్ష్మి, సరస్వతీ దేవతల—నావాహన చేసినాడు. తప్పు లెన్నే పెద్దలకు గేయంలో హిందువుల మూర్తి పూజ కనిపించినది. ఇంతకంటె సత్యదూరమయిన విషయం యింకొకటి లేదు. నవల చివర, యింకా అనేక చోట్లలో బంకిం చంద్రుడే "అనేక దేవతా ఆరాధన' హిందూమతంలోని దుష్టరూపంగా విమర్శించినాడు. కావ్యసుభ గత్వం (Poetic effectiveness) కోసం దేవతా ప్రసక్తి జరిగింది. క్రైస్తవ

కావ్యాల్లో గ్రీకుదేవతా ప్రసక్తి అందువల్లే జరిగింది. ఏ పేరుతో పిలిచినా దేవుని సర్వవ్యాపకత, సామీప్యం, దేశభక్తునికి కావాల్సినది. టాగూర్ "యింటా-బయటా" (The Home and the World) అన్న నవల్లో ఒక పాత్ర దీనిని వ్యతిరేకిస్తుంది. సేవే భగవదర్పితమయితే, ఆ సేవకు ప్రజాశ్రేయస్సే ఫలమయితే, దేశభక్తి, మతప్రాతిపదిక కలదైనా తప్పులేదని బంకిం చంద్రుడు అభిప్రాయ పడినాడు. దైవ స్వరూపమయిన తల్లి మన చేతులకు శక్తినీ, శరీరాలకు జీవ చైతన్యాలను ప్రసాదించవలె, ఎవరి కిస్తుందీమె యీ శక్తిని ? ఒక రాజుకు కాదు, నియంతకు కాదు, ఒక పార్టీకి కాదు. దేశమాతకన్న బిడ్డలకు—పుత్రులకు, పుత్రికలకూ—తల్లి సేవలో వాళ్లు యుద్ధం చేస్తారు; ముక్తకంఠంతో వీరాలాపాలు పలుకుతారు; జాతి అభిలాషలను, ఆకాంక్షలను వ్యక్తం చేస్తారు. పదునెనిమిదవ శతాబ్దంలో వంగరాష్ట్రపు సుదూరసీమల్లో ఒక విప్లవకారుల గుంపు పాడిన పాట భారత జాతీయతకు తీవ్ర వ్యక్తీకరణగా కొనియాడడం జరిగిందంటే దానికి కారణం బంకిం చంద్రుని భావౌన్నత్యం, దేశభక్తికి మతప్రాతిపదిక కలిగించడం మాత్రమే. ఇటువంటి ఉత్తమ భావాలతో, ఉన్నతమయిన ఆవేశంతో స్పష్టమయిన వ్యక్తీకరణతో వ్రాసిన దేశభక్తి గేయం ఏ సాహిత్యంలోనూ లేదు—ముమ్మాటికి లేదు.

# 2

# తొలి నవలలు

బంకిం చంద్రుని తాత్త్వికతలోని వైశిష్ట్యానికి, మౌలికతకు మనం యెటువంటి విలువ నిచ్చినా ఆధునిక భారత నవలాకారునిగా ఆయనపేరు సుస్థిరంగా నిలిచిపోతుంది. ఆయనను ఆంగ్ల నవలాకారుడు స్కాట్‌తో పోలుస్తుంటారు, స్కాట్‌వలెనే ఆయన ఖ్యాతికి తాత్కాలికంగా గ్రహణం పట్టినా, అగ్రశ్రేణి నవలా కారునిగా ఆయన గుర్తింపబడటంలో సందేహం లేదు,

వంగ సాహిత్య ప్రపంచంలో అడుగుపెట్టేముందు బంకిం చంద్రుడు ఈశ్వరచంద్ర విద్యాసాగర్ సంపాదకత్వంలో వెలువడిన 'సంబాద ప్రభాకర్', 'సంబాద సాధురంజన్' పత్రికలలో చాల రచనలు చేసినాడు. వానిలో చాలవరకు పద్యములే వున్నవి. ఆయన విద్యార్థిగా ఉన్న కాలంలోనే రెండు పద్య సంకలనాలు - 'లలిత', 'మానస' - 1856 లో ప్రచురితమైనవి. కిషోరీచాంద్ మిత్రా సంపాదకత్వంలో వెలువడిన 'ఇండియన్ ఫీల్డ్' పత్రికలో ఆయన ఆంగ్ల నవల 'రాజమోహనుని భార్య' (Rajmohan's wife) ధారావాహికంగా ప్రచురితమైనది. అయితే యీ సాహిత్య ప్రక్రియల్లో ఆయన ప్రతిభ కనిపించకపోవడం, ఆయన తరువాతి నవలల్లో ప్రస్ఫుటమైన పరిపక్వత లోపించడం వలన వాటిని గురించి విశదంగా చర్చించవలసిన అవసరం లేదు. ఆయన జీవిత కాలంలో— ఆపైన 1935 వరకూ 'రాజమోహనుని భార్య' గ్రంథరూపములో వెలువడలేదు. తనకీర్తి పతాక స్థాయిలో వున్నపుడు బంకిం చంద్రుడు 'రాజమోహనుని భార్యను' అనువదించ ప్రయత్నించి, ఏడవ ప్రకరణంతో ఆపివేసినాడన్న విషయంకూడ అంత ప్రముఖమయినది కాదు. తన కలం నుండి వెలువడిన రచనల లక్షణం అది సంతరించుకోలేదని ఆయనకే అనిపించి వుండాలె.

వంగ సాహిత్యంలో 'దుర్గేశనందిని' (1865) బంకిం చంద్రుని తొలి సాహస ప్రయత్నం. అయితే దీన్ని సాహస ప్రయత్నంగా వర్ణించడం తప్పు. లోపాలున్నప్పటికీ, కళాత్మకంగా యిది అగ్రస్థాయికి చెందిన నవల. ఒక యుగాన్ని ఆరంభం చేసిన నవల యిది. విష్ణుపూర్ నుండి గర్ మందారన్ పోయే మార్గంలో గుర్రపు రౌతుల ప్రయాణ వర్ణనతో యీ నవల ఆరంభమవుతుంది. ఈ మార్గం వంగ నవలా సాహిత్యానికే - ఆ మాటకొస్తే భారతీయ నవల సాహిత్యానికే రాజమార్గమని ఒక ప్రఖ్యాత విమర్శకుడు చేసిన వ్యాఖ్య చాల సమంజసమయినది. తరువాతి నవలాకారులు యీ రాజమార్గంపై నడచినారు - ఎప్పుడైన ప్రక్కదారులు, సందులూ, గొందులూ తిరిగినా అందరూ తిరిగి రావలసిన రాజమార్గమిదే.

మొదటగా - 'దుర్గేశనందిని' ఉత్కంఠ పుట్టించేటట్లు వ్రాసిన చక్కటి నవల. తప్పుదారులు పట్టినా, నవలాకారులు కల్పితమైన కథలు చెప్పేవారని మనం మరువరాదు. కథా కథనాన్ని ఒక పాత్రకో, ఒక ఆదర్శానికో గౌణంగా చేసినప్పటికీ, కథ మాత్రం తప్పకుండా వుండాలి. కేవలంగా - 'దుర్గేశనందిని'లో

రెండు ముఖ్యరసాలు - శృంగార, వీరములు కథావస్తువులు. ఔన్నత్యంలో కాక పోయినా శక్తివంతముగా చిత్రింపబడిన రెండు పాత్రల్లో యీ రసాలు మూర్తి మంతాలైనవి. అక్కడక్కడా అసంభవాలు, సత్యదూరమైన ఏకకాలిక సంఘటనలు, ఒకటి రెండు భావోద్రేకాన్ని రెచ్చగొట్టే ఉపాఖ్యానాలున్నప్పటికీ, అవి బాధ, త్యాగం ఆనందములతో నిక్షిప్తమైన యీ కథపట్ల మన ఆసక్తిని తగ్గించవు. విధి యిక్కడ వ్యంగ్యయుతము, చంచలము అయినప్పటికీ పూర్తిగా హేతు రహితం కాదు; అలాంటి విధి జన వ్యవహారముల వెనుక నుండి తొంగి చూడటం మనం గమనిస్తాము. ఈ విధి ఒక్కొక్కసారి తల తిక్కగా కన్పించినా మానవ మేధస్సును సిగ్గుపరచేదిగా కూడ మనకు గోచరిస్తుంది.

'దుర్గేశనందిని' యుద్ధానికీ, ప్రేమకు సంబంధించిన కథే అయినప్పటికీ, దాని భూమిక చరిత్రనుండి గ్రహింపబడినది. అందువలననే దానిని చరిత్రాత్మక నవల అంటారు. బంకించంద్రుడు మాత్రం దీన్ని యీ దృష్టితో చూడలేదు. మాన్‌సింగు అక్బరు దర్బారులోగల ఒక రసపుత్ర వీరుడు, చక్రవర్తికి గల సర్దారులలో చాల గొప్పవాడు. పఠానుల నుండి ఒరిస్సాను చేజిక్కించుకునే నిమిత్తమై అక్కడకు పంపబడినాడు. ఆయన పుత్రుడు జగత్‌సింగు పెద్ద పఠాను సైన్యం చేతిలో పరాజయం పొంది, తాత్కాలికంగా ఒక దుర్గంలో రక్షణ పొందు తాడు. ఈ సమయానికల్లా పఠానుల పాలకుడైన కుత్లూఖాన్ చనిపోయినాడు. పఠానులు మాన్‌సింగుతో శాంతి రాయబారాలకు దిగుతారు. ఇంతవరకే ఆ నవలలో అసలైన చరిత్ర. అయితే బంకించంద్రుడు తన సృజనాత్మక శక్తితో మార్పులు, కూర్పులు, చేర్పులు చేసినాడు; జానపద గాథలలో నుండి కొన్ని అంశాలను గ్రహించినాడు. ఈ చరిత్రాత్మక గాథను సర్దారు తనయయైన తిలోత్తమ జగత్‌సింగుల ప్రేమగాథగా బంకించంద్రుడు మార్పుచేసినాడు, ఓటమి ప్రమాదవశాత్తున సంభవించినట్లు వర్ణించినాడు; గర్‌మందారన్ దుర్గం అకస్మాత్తుగా పట్టుకొనబడినది; సర్దారు బంధితుడయినాడు; అతనికి శిరచ్ఛేదం జరిగింది; సర్దారు విధవ భార్య కుత్లూఖాన్‌ను పొడిచి పగతీర్చుకొన్నది. తిలోత్తమతో కలియడానికి చేసుకున్న నిర్ణయం ప్రకారం, జగత్‌సింగు కోటపై దండయాత్ర జరిగినప్పు డక్కడే వున్నాడు. ఆ విధంగా యుద్ధచరిత్ర, ప్రేమ కథతో ముడిపెట్టబడింది. కథలో ద్వితీయభాగం జగత్‌సింగు, కుత్లూఖాన్ కుమార్తె అయేషాలో కలిగించిన కోరికలతో ముడిపడి వున్నది. కుత్లూఖాన్ మేనల్లుడూ, సర్దారు అయిన ఉస్మాన్ ఆయేషాను ప్రేమిస్తాడు, అయితే ఉస్మాన్ చరిత్రాత్మక వ్యక్తి. ఆయేషా

మాత్రం కాదు. ఆమె ప్రేమకై ఉస్మాన్, జగత్సింగుల మధ్య వైరం ఒక కట్టు కథ. ఊహాజనిత మయినది.

బంకించంద్రుడు చరిత్రపట్ల ఎంతో స్వాతంత్ర్యము వహించినప్పటికే పఠాను యుద్ధం, జగత్సింగు పరాజయం, శాంతి రాయబారాలు మొదలైన చారిత్రక సత్యాలను కథలో తీసుకొని వస్తాడు. ఆపైన ఆ పరిస్థితుల్లో జరగడానికి సంభవమయిన విషయాలకే ప్రాముఖ్యత నిచ్చినాడు. ఆగ్రాలోని మానసింగ్ రాజమందిరంతో సర్దారునకు గల పరిచయాన్ని జతచేయడంతో దుర్గగాథకు ప్రాముఖ్యతను కన్పించినాడు బంకిం. కథను యిట్లా పెంచడం, కళాత్మకంగా ఒక కథ నింకొక కథతో మెలివేయడం సర్దారు భార్య విమల సృష్టితో సంభవ మయింది. ఆమె చరిత్రాత్మకవ్యక్తి కాకపోయినప్పటికి కథలో ఆమె ప్రమేయం అసంభవంగా కనపడదు. సర్దారు కుమార్తె తిలోత్తమతో జగత్సింగు ప్రేమగాథ ముఖ్యమైనప్పటికీ బలహీనమైనది. చరిత్రలో జగత్సింగు వట్టి త్రాగుబోతు. కథలో అతనిని నాయకునిగా ప్రవేశపెట్టటం జరిగినది. కాని అతని చర్యలు, సంభాషణలు భావోద్రేకాన్ని రెచ్చగొట్టేటట్లుగా తప్ప వీరోచితంగా వుండవు. ఆమె పేరుతో నవల వెలువడినా సర్దారు కూతురు ఒక అందమైన బొమ్మ మాత్రమే. కాని విమల అట్లాకాదు. ఆమె భయమెరుగని తెలివితేటలు, తనను ఆదరించనప్పటికీ భర్తపట్ల ఆమెకు గల అత్యంతప్రేమ విషమపరిస్థితుల్లో కూడ వీడని ఆమె స్థైర్యం నవల మొదటి భాగానికి తీవ్రతను బీజస్ఫుసు ప్రసాదిస్తవి. విమల ప్రచ్ఛన్నమయిన తరువాత నవల రెండోభాగం నడక కుంటు పడుతుంది.

నవల రెండో భాగంలో ముఖ్యపాత్ర కత్లూఖాన్ తనయ ఆయేషా. ఆమె కూడ చరిత్రాత్మక వ్యక్తికాదు. బంకించంద్రుడు ఆమెను స్త్రీలలో మణిపూసగా చిత్రించినాడు. తొలి ప్రయత్నంగా ఆమెలో ఆత్మసంయమనం, త్యాగం నిక్షే పించినాడు బంకిం. చరిత్ర కనుచితమైన పాత్ర ఆమెది. ఓ నవాబు కూతురు అంతఃపురములో శత్రువైన ఒక రాజపుత్రునికి సేవచేయడం నమ్మశక్యం కానిది. ఆమె ప్రతిరూపం—స్కాట్ నవల 'ఐవాన్ హో' (Ivanhoe) లో యూదుని కూతురు రెబెకా * వలె మనల నాకర్షించదు. ఇమె ఆత్మసంయమనం వీరోచిత

* కొంతమంది నిజంగా బంకించంద్రుడు ఆయేషాను రెబెకా మాదిరిగా సృజించినాడన్నారు. కాని 'దుర్గేశనందిని' వ్రాసేటప్పటికి తాను 'ఐవాన్ హో' చదవలేదని బంకించంద్రుడు అన్నారు.

మైనదే. ఒకసారి మౌనశీలత భంగమైన తరువాత ఆమె ప్రేమ ప్రకటనలు నాటకీయతను ధ్వనింపజేస్తవి. ఆమె ప్రేమ పొందలేకపోయిన ఆమె బంధువు ఉస్మాన్ అసూయ కూడ నాటకీయంగానే వుంటుంది. ఆమె ఉన్నతి పతాక స్థాయిలో వుండగా, కథ నుండి నిష్క్రమిస్తుంది. చివరి పంక్తుల్లో విషాక్తమైన అంగుళీయకాన్ని విసరివేసే సందర్భంలో తప్ప ఆమె చైతన్యవంతంగా మనకు కనిపించదు. సాధుత్వాన్ని సంతరించుకున్న మరబొమ్మవలె కనిపిస్తుంది. తానే కేంద్రమై జరిగే సంఘటనలకు ఎటువంటి ఉత్తేజము ప్రసాదించదు. అయితే ఉస్మాన్, ఆమెకు దూరంగా వున్నంతవరకు చాల ఆసక్తిదాయకమైన పాత్ర; ఆమెకు దగ్గరైనపుడు అతడు ఉన్మాదంగా, యాంత్రికంగా ప్రవర్తిస్తాడు.

'కపాల కుండల' (1886) బంకించంద్రుని రెండవ నవల, ఇది పై లోపా లేమీలేని నవల. మరింత కళాత్మకంగా సంపూర్ణత సంతరించుకున్న నవల. భావనలో, కథా కథనంలో దీటులేని విధంగా వ్రాయబడినది. ప్రపంచములోని గొప్ప నవలల్లో ఒకటిగా చేర్చతగినది. పాక్షికంగా ఆధ్యాత్మికత ఆపాదింపబడి, సున్నితమయిన మానసిక సంఘర్షణ చుట్టూ అల్లుకొని వున్నదీ నవల. ప్రకృతి బిడ్డగా ఒక ఆడపిల్ల మానవ సమాజానికి దూరంగా పెరిగినదనుకోండి. ఆమె లైంగిక ప్రవర్తన ఎట్లా వుంటుంది? ప్రకృతే లైంగికమైనది. ఉత్పాదజనక మయినది అని వాదించవచ్చును. కాళిదాసు శకుంతల, షేక్స్పియరు మిరండాల పట్ల అదే సంభవమైనది. వారు జీవగత ఆకర్షణతో ప్రత్యక్షమైన పురుషుని చూసిన మరుక్షణంలో లైంగికంగా స్పందిస్తారు.

శకుంతల, మిరండాలనుండి మౌలికంగా భిన్నమైన పాత్ర బంకించంద్రుని భావనలో నుండి ప్రభవించినది. ఆయన ఆమె కథను సరియైన స్పష్ట భూమికలో ప్రవేశపెట్టినాడు. మిరండావలె ఆమె సముద్రతీరంలో పెరిగినది. ప్రాస్పెరో గుహవలె కాపాలికుని పర్ణశాల కూడ ప్రకృతి పరిసరాల్లో నిర్మితమైనది. ప్రాస్పెరో, కణ్వమునులవలె కాపాలికుడు దయాసముద్రుడు కాదు. అతడో తాంత్రిక సన్యాసి. తంత్రశాస్త్రానుసారం మానవ కళేబరంపై ఆసీనుడయి కపాలంతో మానవరక్తాన్ని దేవతకు నివేదన చేస్తూ వుంటాడు. ప్రతిదినం ప్రగాఢ మతాభినివేశంతో నరహత్యలు గావించే అటువంటి భీకరమూర్తిని చూస్తూ పెరిగిన కపాలకుండల, ఎదలో మానవులపట్ల ఒక విధమైన జాలినీ తన సొంత విషయాలపట్ల నిరాదరణనీ, గ్రుడ్డిగా అన్నిటినీ విధికి వదలివేసే తత్త్వానికి అలవర్చుకొన్నది. బంకించంద్రుని ఇతర నవలల్లోవలె యిక్కడ జ్యోతిష్కుడు

విధి చేతలను జోస్యం చెప్పటం జరుగదు. అది మానవచరిత్రలో ఒక భాగ మవుతుంది. అందువల్ల శకుంతల, పెర్డిటా, మిరండాల కంటే భిన్నంగా అలాంటి స్త్రీ ప్రవర్తించిందంటే ఆశ్చర్యపడవలసిన దేమీలేదు. పెర్డిటా స్వప్రేరణతో పచ్చగా పెరిగే ప్రకృతిని చూసి ఆనంద విహ్వల అయినది. సౌందర్యాన్ని ఇనుమడింప జేయడానికైనా పుష్పాలను కృత్రిమంగా పెంచటానికి ఆమె నిరాకరించినది. శకుంతల కన్యగా పువ్వులను, లతలను, ఆశ్రమ జంతువులను తల్లివలె ప్రేమించి నది. కపాలకుండల అట్లాకాదు. క్రూరంగా, అమానుషంగా వున్న ప్రకృతే ఆమె కిష్టము. సముద్రతీరం యిసుక దిబ్బలతో నిండి వున్నది. దట్టముగా పెరిగినా చిన్నపొదలు ఆ ప్రాంతాన్ని జీవముతో కళకళలాడుతున్నట్లు చేయలేక పోయినవి. పురుషాగమనం (మిరండా వీరికి 'ధైర్యవంతులైన' అన్న విశేషం పదే పదే వాడుతుంది) మిరండా, పెర్డిటా శకుంతలలో సంయోగ, సంతాన వాంఛలను రేపుతుంది. కాని ప్రమాదంలో చిక్కుకున్న మనిషిని చూసిన కపాల కుండల హృదయం జాలితో కరగి పోతుంది. అందువలననే ఆమె నవకుమారుని రక్షించడానికి విశ్వప్రయత్నం చేస్తుంది. కాని అనుభవా లామెకు జీవితంపట్ల నిరాదరణనే ప్రేరేపిస్తవి.

బంకించంద్రుడు కపాలకుండల అనుభూతుల చిత్రీకరణతోనేగాక ఆమె పెరిగిన పరిసరాల దృష్ట్యా కూడ ఆమెను మాటీ బీబీతో పోల్చి, వారిద్దరి మధ్య గల తారతమ్యాన్ని వర్ణిస్తాడు. ఆమె ప్రత్యర్థి—ఆమె భర్త మొదటి భార్య అయిన పద్మావతి లేదా మాటీ బీబీ. ఈమెది కూడ కపాలకుండలవలె విచిత్రమైన చరిత్ర, రహస్యపూర్ణమయిన వ్యక్తిత్వము. పద్మావతి తండ్రి మహమ్మదీయ మతాన్ని చేపట్టి అక్బరు దర్బారులో ప్రముఖ సర్దారుగా పేరు పొందుతాడు. ఈయన కూతురు లుత్ఫున్నీసా లేక మాటీ బీబీగా పేరు మార్చుకొని మొగలు దర్బారు శృంగారాల్లోను, తంత్రాల్లోను, కుట్రల్లోను వివిధాలైన అనుభవాలను సంపా దించుకొంటుంది. కపాలకుండల ఆనందానికి అధికారానికి ఎంత నిరాదరణ చూపిందో, అంతగా ఆ రెంటినీ ప్రేమించిన స్త్రీ యీమె. ఆ యిద్దరి జీవితాలు ఒక దానితో ఒకటి పెనవేసుకుపోతవి. ఇది విచిత్రమయినా అసహజంకాదు. మాటీ బీబీ కుట్రలతో, దుర్నీతితో నిండిన దర్బారు జీవితంతో విసిగిపోయి, తన పాత భర్తను తిరిగి ప్రేమించడం మొదలు పెడుతుంది. అయితే అతడప్పటికే కపాలకుండలను పెళ్ళిచేసుకొంటాడు. ఇద్దరు స్త్రీలు తాము విధిచోదితులైనట్లు భావించినా వేరు వేరు మార్గాలలో వారి ఆలోచనలు [illegible]

మైన విషయం. కపాలకుండల (కాపానికుని నుండి) క్రొత్తగా పెళ్ళిచేసుకున్న తన భర్తతో పారిపోయే ముందు దేవి భవానికి సత్రపూజ చేస్తుంది. అయితే విగ్రహం మీద ఆకు నిలువక క్రింద పడిపోతుంది. దేవి తన నివేదనను అంగీకరించలేదనీ, తమ వివాహాన్ని ఆమోదించలేదనీ, దీన్ని సూచనగా గ్రహిస్తుంది. గాఢ మత విశ్వాసం కల కపాలకుండల తన వైవాహిక జీవితం విషాదాంతమవుతుందని భావించినది. ఈ భావం ఆమెలో అలౌకికత్వాన్ని పెంచుతుంది; ఆమెలో ఒక విధమైన అశాంతినీ, నిరాసక్తతను పెంచుతుంది. మాటీ బీబీకి విధి, అన్నిటినీ జయింపగలిగే మానవుల వాంఛల యందలి చిక్కు ప్రశ్నగా మాత్రమే గోచరిస్తుంది. కపాలకుండలలో లౌకికత్వం లోపిస్తే, లౌకికత్వమే మాటీ బీబీ. ఆమెలో క్రొత్తగా చెలరేగిన భర్త ప్రేమ దర్బారు జీవితానికి ఆమెను దూరంచేస్తే, అది దర్బారు ఆనందానికే భంగం కాని, ఆమెకు కాదు. ఆమె త్రోవలో కపాలకుండల అడ్డంకి అయితే ఆమె తొలగింపబడాలె. అయితే ఆమెను చంపవలసిన అవసరం లేదు. అది అనవసరమైన బలి. శాశ్వత బహిష్కారం చాలు.

'కపాల కుండల' చక్కగా అల్లిన గ్రీకు కావ్యమంత హృద్యంగా ఉంటుంది. ఇది ఇద్దరు విశిష్ట స్త్రీల కథ. లేదా సహజ ప్రకృతి, శిక్షణ రెండూ అలౌకికంగా మలిచిన ఒక స్త్రీ కథ అనవచ్చును. ఇది చారిత్రాత్మక నవల కాదు కల్పితమైన, అసాధారణమైన యీ కథకు వాస్తవికతను ఆపాదించడానికే రచయిత ఇందులో చరిత్రను పొందుపరుస్తాడు. ఇందులో ఒక ఉపాఖ్యానం చాల శక్తివంతముగా వ్రాయబడినప్పటికీ, యిది ప్రధాన కథకు దూరంగా ఉన్నట్లుని పిస్తుంది. ఇది తరువాత చరిత్రలో నూర్జహాన్ చక్రవర్తినిగా పేరెన్నికగన్న మెహరున్నీసా, మాటీ బీబీల కలయిక. సలీం రాజకుమారుడు మాటీ బీబీ హృదయంలో చెరగని ముద్ర వేశాడు. కాని ఆమెకు భర్తయెడల అపారమైన ప్రేమ వున్నది. ఈ రెండు భావాల సంఘర్షణ ఫలితంగా ఒక స్త్రీ రహస్య పూర్ణమయిన హృదయంలో కలిగిన బాధను బంకించంద్రుడు తన అపార భావనా బలంతో చిత్రించినాడు. అయితే యీ ఉపాఖ్యానం కూడా కథలో నేర్పుగా అల్లబడినది. మెహరున్నీసాతో మాటీ బీబీ కలయిక ఆగ్రా దర్బారును ఆమె వదలివేయ నిశ్చయించుకొనేటట్లు చేసినది. ఈ విధముగా భారత చరిత్రలో అర్థంకాని చిక్కుప్రశ్నగా నిలచి సమ్మోహనపరచే స్త్రీగా వర్ణింపబడిన మెహరున్నీసా, ఈ భావనా ప్రపంచాన్ని ఒకసారి వెలుగు రేఖలతో నింపి, ఆ తరువాత విష్కృ

మిస్తుంది. ఒక నవల శ్రేష్ఠతను ఎట్లా నిర్ణయిస్తారు? భావనా మౌలికత వలననా? చరిత్ర చిత్రణా కౌశలం వల్లనా? శిల్పనైపుణ్యం వల్లనా—? దేనితో విలువకట్టి తీర్పుచెప్పినా 'కపాలకుండల' కంటే సంపూర్ణరసమయ కళాత్మక రచనను ఊహించలేము.

బంకించంద్రుని మూడవ నవల 'మృణాళిని'. 'కపాలకుండల' కంటే 'మృణాళిని' తక్కువదిగా కనిపిస్తుంది. అయితే దాని పరిధిలో అది గొప్ప నవలే. వంగదేశమును, భక్తియార్ ఖిల్జీ నాయకత్వములో పదిహేడుగురు రౌతుల దళం జయించినదన్న ఆరోపణ బంకించంద్రుని జీవితాంతం చికాకుపెట్టిన సమస్య. ఆయన చాల వ్యాసాల్లో ఇది మిన్హాజుద్దీన్ స్వకపోల కల్పితమనీ, తరువాతి చారిత్రకులు దాన్ని ఆమోదించినారనీ, భక్తియార్ ఖిల్జీ, అతని వారసులు—వారి మార్గం ఏదైనా గౌడ లేక వంగ రాష్ట్రంలోని ఒక చిన్న ముక్కను మాత్రమే జయించినారని చెప్పడానికి ప్రయత్నం చేసినాడు. అయితే ఆయన సృజించిన పాత్రలన్నిటికంటే ఆయన భావాలకు ప్రాతినిధ్యం వహించే కమలాకాంతుడు 'పదునేడుగురు రౌతులచే జడిపోయిన జాతి, రాజకీయాల గురించి మాట్లాడడానికి సిగ్గుపడాలి' అని వంగరాజకీయ నాయకులను దూషిస్తాడు. తన జీవితపు తొలి దినాల్లోనే బంకించంద్రుడు 'మృణాళిని'తో చరిత్రను అద్భుతంగా పునర్నిర్మించ డానికి ప్రయత్నం చేసినాడు. అరిస్టాటిల్ భాషతో "అవసరం, సంభవం" అన్నవి చూపించ ప్రయత్నించినాడు. ఇక్కడ చరిత్ర, కవిత్వం సామరస్యంతో కలసిపోయినట్లు కనిపిస్తవి. మన మనఃపటలంలో మహమ్మదీయుల దాడి జరిగి నప్పటి గౌర్ ప్రత్యక్షమవుతుంది—బలహీనమయిన ముసలిరాజు, మూఢనమ్మకాల కాలవాలమైన సభ, ముఖస్తోత్రాలు చేసే సభికులు, రాజద్రోహియైన మంత్రి.

'మృణాళిని' (1869) లో రెండు కథలున్నవి—ఒకటి పైకి కనిపించేది, రెండవది వాస్తవమైనది. పురోభూమికలో మృణాళిని, హేమచంద్రుల కథ కనిపిస్తూ వుంటుంది. అంతఃభూమికలో విజేత భక్తియార్ ఖిల్జీ వంగదేశపు ప్రధాన మంత్రి పశుపతి, అతని దురదృష్టవంతురాలైన ప్రియురాలు, భార్య అయిన మనోరమల వాస్తవకథ జరుగుతూ వుంటుంది. తన రాజ్యాన్ని జయించిన మహమ్మదీయులతో హాస్యాస్పదమయిన యుద్ధప్రయత్నాలు చేస్తూవున్న, విరహ బాధా సంతప్తుడైన మగధ రాజకుమారుడు హేమచంద్రునిగాథ, [illegible] ఘటనలతో హాస్యయుతముగా వుంటుంది. 'దుర్గేశనందిని'లోని జగత్సింగు, తిలోత్తమలవలె మెరయుగా మృణాళిని హేమచంద్రులను కూడ చిత్రిస్తా

బంకించంద్రుడు. అదే యుద్ధోన్మాదం, అదే గాఢావేశపు పారవశ్యత, అదే అనాలోచితమైన ఈర్ష్య, కట్టుకథలకుండే అదే సుఖాంతం.

నవలకు హేమచంద్రుడు నామ మాత్ర నాయకుడు, అసలైన ముఖ్య పాత్ర దుష్టుడైన పశుపతి. పశుపతి యుద్ధం చేయడు కాని, సాలీడువలె కుత్రుల గూడు అల్లుతూ వుంటాడు. లియోనార్డోడా విన్సి 'ఇల్ జియాకోండ్' (Ilgioconde) లో ఒక స్త్రీ పురుషునికై పైశాచిక మోహపాశాలను విసరే దృశ్యం చిత్రించినంత హృద్యంగా బంకించంద్రుడు మనోరమను సృష్టించినాడు. పశుపతి వెనుక మనోరమ తిరుగుతూ పిశాచ భ్రాంతిని కల్గిస్తూ వుంటుంది. ఉన్నత ఆదర్శం ఊహల పరిధులను పెంచుతుంది. దూరదృష్టిని ప్రసాదిస్తుంది. కాని స్వార్థం పరిధులను కుంచింపజేస్తుంది, మసక వెలుగులను ప్రసరింపజేస్తుంది. అందువలననే పశుపతిని సరిగ్గా సాలీడుతో పోల్చటం జరిగినది. సాలీడు దారం పోగులను తీయటంలో అసాధారణ ప్రజ్ఞ చూపుతుంది. అయితే ఆ పోగుల్లో తనకు తానే బంధించుకుంటుంది. నిజంగానే మహమ్మదీయులు పదునేడుగురు గుర్రపు రౌతుల దళంగా ప్రవేశిస్తారు; చాల తేలికగా రాజధానిని జయిస్తారు. దీనికి కారణం దేశం మూఢ నమ్మకాలతో, ముఖప్రీతి మాటలు చెప్పేవారితో (ఈ పరిస్థితులను కళ్లకు కట్టించేటట్లుగా, సరియైన, సంక్షిప్త వర్ణనలు బంకిం తన నవలలో చేసినాడు). రాజద్రోహులతో నిండి ఉండటంతో వాళ్లకు మంచి అవకాశం కలిగినది. ఈ పదిహేడుగురు రౌతుల వెనక యిరవై అయిదువేల బలంగల సైన్యం అరణ్యంలో దాగి ఉండటం మరొక కారణం. ప్లాసీ యుద్ధచరిత్ర బంకిం చంద్రుని ముందున్నది. ఆయన ప్రస్తుత కథను మధ్యలో విడచి తన అద్భుత భావనా శక్తితో వెనుక కథ చెపుతాడు. పశుపతి రాజద్రోహ కారణంగా భక్తియార్ ఖిల్జీ తన దండయాత్రను సంభవంగా చేసుకొంటాడు.

పశుపతి మనోరమల కథ ఆయన సొంతం. వంగ సాహిత్యంలో—ఏ సాహిత్యంలోనయినా - మనోరమ పాత్ర గొప్ప సృష్టి. మనోరమలో ప్రతి స్త్రీ వున్నది. అందువల్ల ప్రతి పురుషుడు ఆమెను చూస్తాడు; ప్రతి పురుషుని తన పైశాచిక సమ్మోహన శక్తితో భ్రాంతి కొలిపి, చివరకు చేజిక్కించుకొనే నైపుణ్యం ఆమెది. ఆమె ఆకర్షణ నిత్యయౌవని క్లియోపాత్రా ఆకర్షణ కాదు. అలవాట్లు, కట్టుబాట్లు ఆమె ఆకర్షణను పేలవంచేయవు. బాల్యపు అమాయకత, యౌవనపు ఆకర్షణ, ప్రౌఢత్వంలోని ప్రాజ్ఞత—యివన్నీ కలసి ఒకటియైన అర్థంలో ఆమె నిత్య యౌవని. అయితే ఆమెలో అప్రాకృతవస్తువేదో వున్నది. అది ఎంత భయం

గొలుపుతుందో, అంత ఆకర్షణీయంగా వుంటుంది. ఆమె దారి తప్పిన వ్యక్తివలె, పిచ్చి ఎక్కిన దానివలె కనిపించుతుంది. అయితే ఆమె ఆలోచనల్లో, చర్యల్లో తార్కికత ప్రతిఫలిస్తూనే వుంటుంది. ఆమె ప్రజ్ఞ, ఎంత బలంగా వేరూని వుందో, ఆమె అమాయకత కూడ అంత బలంగానే పాతుకొని వున్నది. పైన చెప్పినట్లు సమ్మోహనపరచే, మిరుమిట్లు గొలిపే, కలవరపరచే, వెలుగు వెల్లువతో ముంచెత్తే స్త్రీ జీవన మార్మికతకు ఆమె సజీవ చిహ్నం.

మనోరమ మంత్రగత్తె. ఆమె కూడ పశుపతిచే మంత్రబద్ధురాలైనది. ఆమె తెలివితేటలు అమోఘం. ఒక తాత్త్వక సిద్ధాంతానికి వ్యాఖ్యాత్రి ఆమె. కాని ఆమె తన శక్తివంతమైన తార్కికతతో ఆవిష్కరించిన తాత్త్వికత, హేతు రహిత తాత్త్వక సిద్ధాంతంగా వెలువడటం ఆశ్చర్యాన్ని గొలిపే విషయం. ఈ విరోధాభాసం (Paradoxse) యింకో దృష్టి కోణంలో నుండి కూడ కనిపిస్తుంది. బంకిం చంద్రుడు తన నవల ద్వారా నీతి సందేశాన్ని యివ్వతలచుకొన్న నవలాకారుడు. నవలల్లో, ఆత్మసంయమనం, విధ్యుక్త ధర్మం పాటించమని ఉపదేశిస్తూ వుంటాడు. కాని ఆయన సృష్టిలో అత్యున్నతమైన పాత్రయైన మనోరమ విశృంఖల వాంఛల గొప్పదనాన్ని విజయవంతంగా సమర్థిస్తుంది. తాను భర్తృ విహీన—విధవ అని ఆమెకు తెలుసు. తన ప్రేమ, పెళ్ళికి పరిణమించితే, దానికి తాను చెల్లించ వలసిన మూల్యం కూడ ఆమె కవగతమే. అయితే ఆమె వాటిని లెక్కచేయదు. ప్రేమ పవిత్రమనీ, అధిగమించరానిదనీ, హేతువు, నీతి దాని దారిలో నిలిస్తే - అవి భగీరథుడు తీసుకొచ్చిన ఉద్ధృత గంగా ప్రవాహాన్ని నిలుప యత్నించిన విజ్ఞతలేని గజరాజులా - మతి హీనమవుతవనీ ఆమె ప్రగాఢ విశ్వాసం. చివరకు మనోరమ తాను ఎంతో కాలం క్రితం కోల్పోయిన పశుపతి భార్యగా గుర్తిస్తుంది. కాని కుతంత్రపు పునాదులపై తన వైవాహిక జీవితాన్ని ప్రారంభించవలె ననుకోదు ఆమె. అయితే యిది ఒక కల్పిత గాథ; జ్యోతిశ్శాస్త్రానికి, ఆచార వ్యవహారాలకు తల ఒగ్గిన గాథ. మనోరమ గొప్పదనం ఆమె రహస్యపూర్ణమయిన ఆకర్షణలో ఉన్నది; తార్కికత లోపించిన ప్రేమ పక్షాన వాదించిన వాదంలో వున్నది. ఒక దేశ స్వాతంత్ర్యం కూడ పెద్ద త్యాగమేం కాదు, అటువంటి బహూకృతి పొందడానికి అని మనం ఆశ్చర్యపోతాం.

ఇంతకు పూర్వం చెప్పినట్లు పందొమ్మిదవ శతాబ్దపు వంగ సాంస్కృతిక పునరుజ్జీవనంలో ఒక లక్షణం ప్రాత క్రొత్తల మధ్య సంఘర్షణ. మనోరమ కథల్లో, యిలా ఘర్షణ శక్తివంతముగా ఆవిష్కృతమైనది. అది తరువాతి నవలల్లో

కూడ — ముఖ్యంగా మధ్యకాలపు నవలల్లో కనిపిస్తుంది. మధ్యకాలపు నవలల్లో నీతి సంప్రదాయాలకు — హృదయగత భావాలకు మధ్యగల సంఘర్షణ చిత్రిత మైనది. రెంటిలోను మూలభూతమైన సంఘర్షణలను నిర్ణయించక వదలివేయడం, సుఖాంతాల్లో తప్ప ముగింపులు సామాన్యంగా సంతృప్తికరంగా లేకపోవడం పరిశీలించితే, రచయిత దృష్టి, జీవితాన్ని అర్థం చేసుకున్నటు వుంటుంది. ఇది అత్యున్నత సాహిత్యపు లక్షణం. కట్టుబాట్లకు, కట్టుకథలకు తల ఒగ్గినట్లు కనిపించే వాతావరణంలో, వ్యతిరేకశక్తుల ఉద్రిక్తతయే 'విషవృక్షం', 'చంద్ర శేఖరుడు', 'రజని', 'కృష్ణకాంతుని వీలునామా' వంటి నవలలు జనాదరణ పొందడానికి కారణం.

# 3

# మధ్యకాలపు నవలలు

నాల్గవ నవల 'విషవృక్షం'; (1873) నవలాకారునిగా బంకిం చంద్రుని జీవితంలో క్రొత్త మజిలీ. ఇది భూతకాలానికి సంబంధించిన కల్పిత గాధ కాదు. బంకిం చంద్రుని కాలంలో, ఆనాటి వంగ సమాజంలో జరిగే సంఘటనలను చిత్రించే సాంఘిక నవల యిది. ఆయన కాలంలో తీవ్రంగా చర్చితమైన సమస్యలు - విధవా వివాహం, బహుభార్యాత్వం - రెండూ యీ కథలో కని పిస్తవి. అయితే ఆయన వీనిని సాంఘిక సమస్యలుగా చర్చించలేదు. 'విష వృక్షాన్ని' సమస్యాయుతమైన నవలగా పరిగణించడం కూడా పొరపాటే. నగేంద్ర నాథుని ద్వితీయ కళత్రం కుందనందిని, విధవగాక, కన్యగా వున్నప్పటికీ జరిగే దేమీలేదు. ఇద్దరు భార్యలు - భార్యలుగా - కలసి జీవించరు. బంకిం చంద్రుడు పాత్రల వ్యక్తిగత చరిత్రలకే ప్రాధాన్యమిచ్చాడు కానీ, ఆ చరిత్రలవలన ఉత్పన్నమయిన సామాజిక సమస్యలకు గాదు. దీని నెవరైనా నీతి బోధాత్మకమైన నవలగా పరిగణించవచ్చును. ఈ విషయం పేరులోనే సూచితమైనది — కాని యిది సమస్యాయుతమైన నవల మాత్రం కాదు.

నాయిక సూర్యముఖి పురోభూమికలో వున్నది. ఆమె యింటినుండి పారి పోయినపుడు కూడ కథ ఆమె చెప్పుచేతుల్లో వున్నట్లే కనిపిస్తుంది. బంకించంద్రుడు

ఆమెను తన నవలలో ప్రధాన పాత్రగా నిర్దేశించినాడు. పాఠకులు, విమర్శకులు ఈ కథ ప్రముఖంగా సూర్యముఖి కథే అనుకున్న సందర్భం కూడ లేకపోలేదు. అయితే మనలో యేర్పడిన భావాలను పరిశీలించితే, నవలలోని ప్రముఖ పాత్రలన్నిటిలోను యీమె పాత్రయే తక్కువ ఆసక్తిదాయకమైనదని స్పష్టమవుతుంది. నవలలో ఆమె ప్రయోజనం, ఆమె భర్త నగేంద్రనాథ్ దురదృష్టవంతురాలైన అతని రెండవ భార్య కుందనందినిలను కథలో ప్రవేశపెట్టడం మాత్రమే. సూర్యముఖి తనంతట తానుగా పనిచేసే పాత్రకాదు. అంటే ఒక్క యింటిలో నుండి పారిపోవడంలో తప్ప ఆమె తన వాంఛలను, మనోగత భావాలను అనుసరించి నడచిన వ్యక్తి కాదు. ఎప్పుడూ సాంఘిక నీతిని అనుసరించడానికే ప్రయత్నం చేసినది. అందువలననే అవినీతిపరుడైన తన భర్త కౌగిటిలోనికి తిరిగి వెళ్ళ గలుగుతుంది. ఆపైన తమ దంపతుల నడుమ రెండవ స్త్రీ నీడను సహించ గలుగుతుంది.

ఆమె భర్త నగేంద్రనాథుడు మధ్యతరహా మనిషి. అత్యుత్తముడూ కాదు ; అతి నీచుడూ కాదు ; వ్యసనలోలుడూ కాదు. బంకిం చంద్రుని చిత్రీకరణలోగల రహస్యం అతని యీ సాధారణత్వంలోనే వున్నది. అతడు లొంగిన వాంఛ చాల ప్రబలమయినది కావడంవల్ల అతడు గొప్పవాడా, కొద్దివాడా అన్న ప్రశ్నే మనకు ఉద్భవించదు. బంకిం చంద్రుడు ఇతని చరిత్రను మరింత ఓజస్సుతో చిత్రించి నట్లయితే అతని యీ వాంఛాగమనం మన దృష్టినుండి తప్పిపోయేది. ఆటంక పరచలేని యీ విషాదాంత గాథ, గతించిన దశలలో మనకు సోఫకిల్స్ నాటకంలోని కళాత్మక ప్రతిభ గుర్తుకు తెస్తుంది. విధి అప్పటికే హెచ్చరిక చేసినది ; నగేంద్రనాథుడు కూడ కోరికల నదుపులోనుంచుకోవడానికి తన శాయశక్తులా ప్రయత్నించినాడు. కాని అతడు తనను అదుపులో నుంచుకోలేని శక్తి హీనుడు. కుందనందిని తిరిగి కోలుకోలేని విధంగా అతని వినాశనానికి దారి తీస్తుంది. నీతి, బోధల్లో శాఖ, ఉత్కృష్టమైన కళ నీతిదాయకమై వుండాలనిపిస్తుంది మనకు. ఎందువల్లనంటే కళ, మానవుని తప్పిదాన్నీ, దుఃఖాన్నీ విధి వశాత్తూ సంభవించి నవిగాకాక విశ్వగమనంలో ఒక అంశంగా చూపుతుంది ; మానవుని తప్పిదం అగాధమయిన ప్రాకృతికశక్తుల ప్రమాదభరితమయిన ఫలితంగా చిత్రిస్తుంది.

నగేంద్రనాథ్, కుందనందినుల ప్రేమ వ్యవహారం పాటలు పద్యాలతో మధురంగా వుంటుంవి. కుందనందిని మనస్సు చరిత్ర ఆశించని విధంగా పరిణమించడం మొదలయిన నగేంద్రనాథుని వ్యక్తిత్వం, క్రమంగా పతనమవుతుంది.

ఆమె మొదట ఒక చిన్న పిల్లగా కనిపిస్తుంది. చివరిదాకా తన అభిప్రాయాన్ని ధైర్యంగా చెప్పగలిగే, దృఢంగా సమర్థించుకునే వ్యక్తిత్వము లేదామెకు. అయితే ప్రేమ ఆమెను ఒకస్త్రీగా పుష్పింప జేస్తుంది. బంకిం చంద్రుడే ఆమె మరణాన్ని పువ్వు వాడిపోవటంతో పోల్చినాడు. అటువంటి స్త్రీని సానుభూతితో చిత్రించేటప్పుడు బంకిం చంద్రుడు అవినీతిని ప్రబోధించడం లేదా అన్న ప్రశ్న వచ్చినది. ఇక్కడ బంకిం చంద్రుని చిత్రణ, తప్పిదంజేసే మానవుల యెడ ప్రగాఢ సానుభూతిని వ్యక్తీకరిస్తుందనడంలో సందేహం లేదు. పైన, ఉత్కృష్టమైన కళ నీతి దాయకమై వుండాలని చెప్పుకొన్నాము. అయితే కళ అవినీతిదాయకంగా కూడ వుండవలసి వుంటుంది. ఎందువల్లనంటే అది సామాజిక శక్తుల కంటే లోతైన, బలీయమైన సహజ పాశవికశక్తుల కార్యకలాపాలను ఆవిష్కరించవలసి వుంటుంది. మన సహజ భావనలు, మొదటి జీవకణం జడపదార్థం నుండి జనించినప్పుడే, పారంపర్యంగా మనకు సంక్రమించినవి. హేతువు, నీతి మానవుడు తరువాత సంతరించుకొన్నవి. మొదట వచ్చిన చెవులకంటె తరువాత వచ్చిన కొమ్ములు వాడియైనవి అన్న పరిస్థితి - పిల్లలు తాతని శాసించినట్లయినది.

గేయ కావ్యాల్లోని హితమైన సంగీత మాధుర్యం, కథా ప్రణాళికా ప్రాముఖ్యం, గ్రీకు విషాదాంత కావ్యాల లక్షణాలు. సుదీర్ఘత, కథకంటే పాత్ర చిత్రణకు అధిక ప్రాధాన్యం, ఆధునిక కాల్పనిక నవల లక్షణాలు. అయితే 'విషవృక్షం' గ్రీకు విషాదాంతకావ్యాల, ఆధునిక కాల్పనిక నవలా లక్షణాలను – రెండింటినీ తనలో సమన్వయం చేసుకున్నది. ప్రాచీన విషాదాంత కావ్యాలలో విధియే వ్యక్తి శీలమవుతుంది. అందువలననే విధికి ఎరయైన వ్యక్తికి ముందుగా హెచ్చరిక చేయడం జరిగినా అతడు దాని నుండి తప్పుకోలేడు. కాల్పనిక విషాదాంత రచనలలో వ్యక్తి శీలమే విధిగా పరిణమిస్తుంది. పురుషులు, స్త్రీలు ఎన్నో ప్రణాళికలను వేస్తారు – అవే చివరకు తమను ముంచివేస్తవి. లూయియాస్, జొకాస్టా, ఇడిపస్‌లకు సోఫకిల్స్ నాటకంలో హెచ్చరిక చేసినా ప్రయోజనం లేనట్లు, కుందనందిని విషయంలో కూడ హెచ్చరికలు నిష్ప్రయోజనాలవుతవి. 'ఇడిపస్ టిరాన్నస్' నాటకంలో ప్రధాన పాత్రలు వేసే ప్రతి అడుగూ తిరిగి వెనుకకు తీసుకోలేని విధంగా వాటిని కూరలత దుఃఖభాజనం చేస్తవి. అదే విధంగా కుందకూడ నిస్సహాయస్థితిలో నగేంద్రుని సహాయం పొందవలసి వస్తది. తాను పూర్వపు [illegible] చేతిలో ఏమీ లేదు. కాని

నగేంద్రునిపట్ల ఆమె వాంఛ ఆమె సొంత విషయం ; అదికూడ ఆమెను నాశనం చేస్తే, తన విధిని తానే రచించుకున్నదామె.

కుంద విషయంలో హెచ్చరిక పొందడానికి నగేంద్రునికి యే మానవాతీతమైన శక్తి సహాయం అవసరం లేదు. చక్కటి లౌకిక దృష్టి, తెలివీ అతని కున్నవి. మంచి సలహా నివ్వడానికీ అతని చుట్టూ మనుషులున్నారు. కుందకంటే ఇతని విషయంలో శీలమే విధిగా పరిణమిస్తుందన్న సిద్ధాంతం నిజమవుతుంది. విషమ పరీక్షలో నుండి అతడూ సూర్యముఖీ 'శాంతి ఉపశమనములతో' బయటపడినప్పటికీ 'వాంఛలుడిగి ప్రశాంత బత్తు' లైనారనుకోవడం వ్యర్థమయిన ఆలోచన. తన వాంఛా పరితృప్తికై, ఆపైన సూర్యముఖి సుఖం భగ్నం చేయడానికై, వారి జీవితాల్లో ప్రవేశించిన హీరా తాను యితరులకు చేయకలిగిన కీడుకంటె ఎక్కువ కీడే పొందుతుంది. విధి తన మార్మిక లక్ష్యాలకు తగిన విధంగా వ్యక్తి శీలాన్ని మలచుకొంటుంది. వ్యక్తి శీలం విధికి రూపుదిద్దుతుంది. ఈ విధంగా కాల్పనిక సాహిత్యం స్వతంత్రమనేదానిని, ప్రాచీన సాహిత్యం తప్పనిసరి విషయంగా గుర్తించినవి. ఈ నవలలో యీ రెండూ ఒకటి నొకటి గాఢంగా పెనవేసుకుపోయినవి. నిర్మాణ పద్ధతిలో కూడ 'విష వృక్షం' గ్రీకు విషాదాంత కావ్యాల బిగువునూ, పందొమ్మిదో శతాబ్దపు కాల్పనిక నవలల సడలింపును రెండు లక్షణాలను తనలో కలుపుకొనినది.

'విష వృక్షం' తరువాత బంకించంద్రుడు రెండు చిన్న కథలను వ్రాసినాడు. మొదటి దానిలో కథ వర్తమాన జీవితాన్ని ప్రతిబింబిస్తుంది — రెండవ దానిలో ఆయన దృష్టి భూతకాలంవైపు తిరిగినది. ఈ తరువాతి నవల 'చంద్ర శేఖరుడు' (1875) లో ఆయన తురల చరిత్రనుండి ఇతివృత్తం గ్రహించినాడు. 'చంద్రశేఖరుడు'లో అతని తొలి నవలలో కంటె ఎక్కువ చారిత్రక ప్రాధాన్యత కలిగి వుండటానికి కారణం, యిక్కడ రచయిత ఆ మధ్యే జరిగిన గొప్ప సంఘటనలను — మీర్ ఖాసిం పరాజయం, వంగదేశంలో బ్రిటిషువారి ఆధిపత్యం సంఘటితం కావడం చిత్రించడమే కాక, తమ ప్రశాంత పరిసరాలను వదలుకొని చారిత్రకమైన అలజడులలో చిక్కుకుపోయిన, పల్లీయుల మీద దీని ప్రభావం చూపడమే. బంకిం చంద్రుడు చరిత్రకు అపార్థాన్ని కల్పించినాడని కొందరు ఆక్షేపించినారు. ఈయన మీర్ ఖాసింను దేశభక్తునిగా, యుద్ధపరిసరాల్లో ఆంగ్లేయులను తరిమివేయాలనే నిష్ఫలమైన కార్యమును చేపట్టిన యుద్ధోన్మాదిగాను నవాబులతో కాక, [illegible]

లోలుడుగా) చిత్రించడమే వారి ఆక్షేపణకు మూలం. కాని యిది సరియైన దృక్పథం కాదు. చరిత్రాత్మక నవలల పని గతకాలపు సంఘటనలను తిరిగి చెప్పడం కాదు. గొప్ప చారిత్రికుడైన ట్రెవెలియన్ అన్నారు—చరిత్రాత్మక నవలలు చరిత్రను నిత్యపరిణామాత్మకమై ఎప్పటికీ పరిపక్వత పొందలేని ఒక మహదాశయంగా చిత్రిస్తవని - అయినా అవి చరిత్రను మానవత్వమంత సజీవమై, సంశ్లిష్టమై, విశాల దృక్పథం కలిగిన సంఘటనలవలె ప్రతిపాదిస్తవి. చరిత్రలో మనకు కనిపించే సంశ్లిష్టత - సాంఘిక, ఆర్థిక, సంఘటనాత్మక, సైనిక శక్తులలో, నిహితమయిన సంశ్లిష్టతయే - కాని నవలలో యీ సంశ్లిష్టత మానవుల మధ్య ఆశయ పోరాటాల రూపంలో, విరుద్ధమైన ఉద్దేశాలరూపంలో క్లిష్టమైన సంబంధ బాంధవ్యాల రూపంలోను ప్రతి ష్ఠాపనం చేయబడినది. షేర్ ముతా ఖరిన్ క్రానికల్ (క్రానికల్ అనగా సంఘటనలను కాలక్రమంతో వివరణచేయు పుస్తకం) మీర్ ఖాసిం, శక్తివంతుడూ, పొగరుబోతూ, అంత విశ్వాసపాత్రుడూ కాని తన సర్దారు గుర్గిన్‌ఖాన్‌పట్ల కురిపించిన తగని కటాక్ష వీక్షణాల గురించి ప్రస్తావిస్తుంది. ఆర్మీనియా దేశపు బట్టల వర్తకుని ఇంద్రజాలికోన్నతిని గూర్చి, నవాబు కతనిపట్లగల గ్రుడ్డి ఆదరణ గూర్చి యిది సరిగ్గా విశదీకరించదు. బంకిం చంద్రుడు తన మేధాశక్తితో గుర్గిన్ సోదరీ, మీర్ ఖాసిం రాణి అయిన దళని పాత్రను సృజించినాడు. చారిత్రక సమస్య తీరిపోయింది కాని, జీవితంలో మార్మికత పెరిగినది. గుర్గిన్ సంయమనం లేని మహత్వాకాంక్షి, అసాధారణ మేధావి, కాని జాలిగొలిపే విధంగా ముందు చూపులేనివాడు. ఆంగ్లేయులు ఏ నవాబు ప్రక్కలోనయినా బల్లాలేనని, అందువలన వారిని నిర్మూలనం చేయ వలెననీ తెలుసును అతనికి. ఆ తరువాత మీర్ ఖాసింను తొలగించటం చిటికల్లో పని. అప్పుడతడు నవాబు కాగలడు. అందుకని దళనికి, ఆమెను రెండవ నూర్జహానుగా చేస్తానని, ఆశగొలుపుతాడు.

జీవితం నిరంతర పరివర్తన శీలమైనది. అది యిక్కడ కుతూహాల పూర్ణ మయిన ఆకాంక్షను, అభిలాషను వ్యక్తపరుస్తూ వుండును. క్రమప్రవర్ధమాన మవుతున్న బ్రిటిషువారి నిర్మూలనకై దురదృష్టజాతకుడయిన నవాబు ప్రయ త్నించినాడు. ఘోరపరాజయం పొందినప్పటికీ అతని ఉత్సాహం సన్నగిల్లదు; తరచు ఉన్మాదివలె ప్రవర్తించినా అతని నిశిత దృష్టి తగ్గలేదు. కథానాయకుడైన ప్రతాపుడు చరిత్రాత్మక వ్యక్తికాదు. ఆంగ్లేయులపై తాను ధ్వజమెత్తడానికి అతని కారణం అతనికున్నది. అతడు చివరకు వీరమరణాన్ని పొందుతాడు, తానే

ప్రియంగా ఎంచే అన్నిటికీ విదేశీయులు శత్రువులుగా గోచరిస్తారతనికి. అందు వలన అతడు ఆత్మశోధనలోనేగాక, నవయుగ నిర్మాణానికై జరిగిన ఘటనలలో నాయక పాత్ర వహించుతాడు. మృతిలేని ఆకాంక్షకు చిహ్నం యితడు. దృఢత్వం, ధైర్యం, అసాధారణ సామర్థ్యం, నీతిపట్ల అలక్ష్యం మొదలుగా గల లక్షణాలు సంతరించుకొనిన చక్కని దళంగా చిత్రించబడిన ఈస్టు ఇండియా కంపెనీ ఉద్యోగస్థులు, ప్లాసీ యుద్ధం తరువాత బ్రిటిషు సామ్రాజ్య స్థిరత్వంపట్ల అచంచల విశ్వాసం కలవారుగా కనిపించుతారు. హిందూ ధనవంతులపట్ల ప్రజలు భయభక్తులతోనే మెలిగినారు. అయితే యీ ధనవంతులే భయానికి లోనయినారు. కథలో వర్ణితమయిన సంఘటనలలో వారి కెటువంటి సూటి సంబంధంలేదు. అయితే వారి మనోవైఖరి, ప్రవర్తన ఆ కాలపు పరిణామాత్మకమయిన వాతావరణాన్ని ప్రతిబింబించుతవి.

పురో, అంతఃభూమికల్లో చరిత్ర స్పష్టాస్పష్టముగా గోచరించినా, ముఖ్య కథ చరిత్రకు సంబంధించినది కాదు ; సూటిగా యెటువంటి సాంఘిక సమస్యలను ప్రతిపాదించదు.

మీర్ ఖాసింకు జ్యోతిశ్శాస్త్రంలో నమ్మకమున్నదనీ, తరచుగా హిందూ జ్యోతి శ్శాస్త్రజ్ఞులను సంప్రదించేవాడనీ క్రానికల్ వలన తెలుస్తుంది. చరిత్రనుండి యీ విషయాన్ని గ్రహించిన బంకిం చంద్రుడు నవాబు గురువూ, సలహాదారుడూ అయిన జ్యోతిశ్శాస్త్ర పండితుడు చంద్రశేఖరుని పేరు నవలకు పెట్టినాడు. ఈ విధంగా చారిత్రక ఘటనలను చంద్రశేఖరుని గృహస్థ జీవిత వర్ణనతో ముడిపెట్టినాడు. అపైన, నవల యితివృత్తము అంతా యితర పాత్రలకు ప్రాముఖ్యత నిచ్చినప్పటికీ బంకిం చంద్రుని మనోహరమైన పాత్రలలో ఒకటియైన చంద్రశేఖరుని భార్య శైవలిని కథయే. ఆమె చిన్నపిల్లగా వున్నపుడే ప్రతాపుని ప్రేమిస్తుంది. ఆమె పెళ్ళియైన తరువాత అతని కొరకై గట్టిపట్టుదలతో, నిరాశతో వెదుకుతుంది. ప్రతాపుడు నాయక పాత్ర ; ఆమె మార్గం నుండి పూర్తిగా నిష్క్రమించడానికి వీరోచిత మరణాన్ని ఆహ్వానిస్తాడు. 'విషవృక్షం'లో ఏ విధంగా సూర్యముఖి ప్రయోజనం నగేంద్రనాథ్, కుందనందనుల ప్రేమకు, దాని అనంతర పరిణామములను అతిశయింపజేసినట్లే ఎన్నో గొప్ప లక్షణాలు కలిగి ఉన్నా, శైవలిని హృదయ పరితాపానికి ఆశ్వాసం చేకూర్చడమే యీ నవలలో ప్రతాపుని ప్రయోజనంగా కనిపిస్తుంది.

శైవలిని ఎనిమిది సంవత్సరాల చిన్నపిల్లగా ఉన్నపుడే ప్రతాపుని ప్రేమించ మొదలుపెడుతుంది. పెరిగి పెద్దదైన తరువాత తన కోరిక యెంత నిరర్థకమయినదో ఆమె కర్థమవుతుంది. కారణం, వారి వివాహం హిందూ సంఘానికి, కట్టుబాట్లకు వ్యతిరేకమయినది. వారు ఆత్మహత్య చేసుకొనడానికి నిర్ణయించుకొంటారు ; కాని శైవలిని సంశయిస్తుంది. ప్రతాపుడు రక్షింప బడతాడు. చంద్రశేఖరునితో ఆమె వివాహం జరుగుతుంది. అయితే ఆమె ప్రతాపుని మర్చిపోలేదు. కొన్నాళ్ల తరువాత మరల తన ప్రియునితో కలసే దుస్సాహసం చేస్తుంది. హేతుబద్ధం కానిదీ, అర్థరహితమూ అయిన యీ సాహస కృత్యం, ఆమెను గమ్యంవైపుగాక, మరేదిక్కుకైనా నడపించే లక్షణం కలది. కాని ఆశించనిది సంభవిస్తుంది. ఆమె ప్రతాపుణ్ణి కలుస్తుంది. మళ్ళీ రెండవసారి ఆత్మహత్యా నిర్ణయం చేసుకోవడానికి వారికి అవకాశం కలుగుతుంది. కాని యీసారి ప్రతాపుడు ఆమెను యీ ప్రయత్నం నుండి విముఖురాల్ని చేస్తాడు. ఆమె తిరిగి వస్తుంది. యోగసిద్ధుల పొందిన సన్యాసి రామానంద స్వామిచే పునః శుద్ధి పొంది ఆమె తిరిగి గృహప్రవేశం చేస్తుంది. శక్తివంతమైన డాంటే ఖండికలను తలపింప జేసినప్పటికి శైవలిని యీ కథా భాగం నమ్మశక్యమైనదిగా కనుపించదు. తొలిదశలో శైవలిని – ఆమె తీవ్రమైన కోరికలతో క్షుభితమైనపుడూ, ఆమె ప్రియుని వెదికేటప్పుడూ, చివరకు ఆపజయం పొందినపుడూ–మన దృష్టిని ఆకర్షిస్తుంది. కట్లుబాట్లకు లోనయి కథ ముగుస్తుంది. కథ మధ్యలో శైవలిని వేసిన ప్రశ్న మన హృదయ కుహరాల్లో ప్రతిధ్వనిస్తుండగా మనం నవల పూర్తి చేస్తాము. ఆమె, ప్రతాపుడూ ఒకే కొమ్మపై కలసి పెరుగుతున్న జంటపూలు. మతానికి, సంఘానికి వారిని విడదీసే హక్కున్నదా ?

'చంద్రశేఖరుడు' తరువాత వచ్చిన నవలలు 'రజని' (1877), కృష్ణ కాంతుని వీలునామా (1878). ఈ రెండింటి మధ్యలో యింకో చిన్నకథ 'రాధా రాణి' కూడ వెలువడింది. పై రెండు నవలలు చరిత్రకు సంబంధించినవి కావు. అవి సాంఘిక, గృహస్థ, వ్యక్తిగత జీవితాలకు సంబంధించినవి. వీనిలో మొదటి నవల 'రజని' కథావస్తువులోను కథా కథనంలోను విశిష్టత కలిగి వున్నది. బంకిం చంద్రుడు తన నాయిక పాత్రను (ప్రేమలో తల మునకలవుతున్న పూలమ్ముకొని బ్రతికే ఓ ఆడపిల్ల) లిట్టన్ వ్రాసిన పాంపే చివరి రోజులు (Lytton's 'The Last Days of Pompii') అన్న నవలలోని పాత్ర నిడియ్యానుండి గ్రహించినాడు, ఒక అంధురాలైన బాలిక సంవేదన, అనుభవం,

ఆవేశాల పునఃసృష్టి చేయ ప్రయత్నించినాడు బంకిం చంద్రుడు. చారిత్రిక భూమిక లిట్టన్ నవలకు సమకూర్చిన ఔదార్యం విషాద మహత్వం ఈ నవలలో మనకు కన్పించవు. విషణ్ణ మితభాషిత్వముతో మిశ్రితమైన గాఢమైన ఇంద్రియ ప్రాబల్యం నిడియా కథకు సంతరించిపెట్టిన అద్భుతాకర్షణ మన కిక్కడ గోచరించదు. కొన్ని విషమ సంఘటన లెమరైనా కథ సుఖాంత మవుతుందన డంలో ఎటువంటి సందేహం కలుగదు మనకు. బంకిం చంద్రుని నవలల్లో సాధారణంగా కనిపించే అవిశ్వసనీయమైన కల్పనా గాథల లక్షణాలను కూడ సంతరించుకొన్నదీ కథ. పూలమ్ముకొని జీవించే దరిద్ర బాలికను అమూల్య సంపత్తికి వారసురాలుగా చేసే అవిశ్వసనీయమైన వీలునామా ఉపాఖ్యానం వున్నదీ కథలో; అసంభవాన్ని సాధించే సన్యాసికూడ వున్నాడిక్కడ. అయితే యీ కట్టు కధల చక్రంలో మనల తన్మయం చేసే కథకూడా యిమిడి వున్నది. హామ్లెట్ నాటకంలో పిశాచపు అస్తిత్వాన్ని మన మంగీకరించినట్లుగా, సన్యాసి మానవాతీత శక్తులు లవంగలత తెలివికి మాత్రమే పదును పెడుతవి. వీలునామా వెలికితీయ బడటం చిక్కులతో కూడిన వ్యవహారమయినప్పటికీ, రజని, అమరనాథ్ పాత్రలకు హాయిని చేకూర్చినది.

చరిత్రను వెలువరించడంలో ఎంతో ఉత్సాహం కనబరచిన బంకిం చంద్రునకు, తాను లిట్టన్ నవల నుండి ఎన్నో సూచనలు గ్రహించినా, తన నవలకు చారిత్రక భూమిక సంతరించిపెట్టవలెననే ఆలోచన కలుగక పోవడం మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఆపైన రెండవ స్త్రీ లవంగలత కథను నేర్పుగా అల్లడంతో, ముఖ్యకథకు క్లిష్టతను ఆపాదించినాడు. ఈ యిద్దరు నాయికలలో ఒకస్త్రీ ప్రేమలో వైఫల్యం పొంది, రవ్వంత ప్రయత్నంతో రెండవస్త్రీని వివాహం చేసుకోగల అమరనాథుడు ఈ రెండు ఉపాఖ్యానాలకు వారధి. లవంగత ఒక ముసలి భర్తకు రెండవ భార్య. అతని మొదటి భార్య బ్రతికేవున్నది. లవంగలత మసలకు తన తెలివి తేటలతో మిరిమిట్లుగొల్పుతూ కనిపిస్తుంది. సుఖ సంతో షాలతో మునిగి తేలుతూ వుంటుంది. హృదయాంతరాల్లో పూర్వాచార పరాయణు డైన బంకిం చంద్రుడు కొన్ని పరిస్థితుల్లో బహు భార్యాత్వం అంత చెడ్డది కాదని నిరూపించడానికి ప్రయత్నం చేసినాడా? అనిపిస్తుంది. అదే నిజమయితే ఆయన ఊహ, ఆయనకు కథా ప్రారంభంలో వున్న ఉద్దేశాలను అధిగమించిన దనవలెను. ఆయన హృదయాలను కదలించే నిషేధ ప్రేమ కథే వ్రాసినాడనాలి, ఆ విధంగా ఆయన తనకు గొప్ప వారసుడైన శరత్చంద్రునికి మార్గదర్శకుడయినా

డనాలె—కారణం లవంగలత తన ఉద్రేకంలో పడిన చిక్కులు, మూలభూతంగా దేవదాసుకై పార్వతి పడిన పాట్లవలెనే వుంటవి. ఆమె తన మొదటి ప్రియుడిపట్ల అంతకు క్రితం క్రూరంగా ప్రవర్తిస్తుంది; అతను రజనిని పొందుటకై చేసే ప్రయత్నాల విఫలం చేయ ప్రయత్నం చేస్తుంది; తాను పెండ్లి చేసుకున్న ముసలి భర్తపట్ల అనర్గళ ప్రేమ ప్రకటనలు చేస్తుంది. ఆమె ఆ ప్రకటనలలోని నిష్కాపట్యాన్ని అనుమానించే కారణం మనకు కనుపించదు. కాని ఆమె ఆత్మ వంచనకు గురికాని వ్యక్తి కాదని గట్టిగా చెప్పలేం. ఈ బాహ్యప్రకటనలు, చర్యల వెనక, ఆమె ప్రశాంత హృదయసీమలో ఒక మూల అమరనాథునికి పట్టం కట్టినది. ఆమె విచారంగా, మాటలు తొట్రుపడుతూ వుంటే అన్నట్లు (అసలామె ఆ వాక్యం పూర్తి చేయదు). ఈ సీమలో దీపం వెలుగదు; పువ్వు వికసించదు. అయితే ఆమెకు వ్యక్తీకరించడానికి బలం, ధైర్యం లేని యితరమైన ఆలోచనలు, ఆశలు వున్నవి. సునిశిత మేధాశక్తి, ఎలాంటి వ్యతిరేకతనయినా అధిగమించే వ్యక్తిత్వం కల స్త్రీ ఆమె. కాని అమరనాథుడు ఎదురైనపుడు ఆమె చలిస్తుంది; తన మనోబలాన్ని యింక పరీక్షకు పెట్టవద్దని విషాదంగా ప్రార్థిస్తుంది.

కథ చెప్పడంలో బంకించంద్రుడు ప్రతి ముఖ్యపాత్రచేత తన కథను చెప్పించే విధానాన్ననుసరిస్తాడు. రవీంద్రనాథుడు తన 'ఘరేబయరే' (ఇంటా—బయటా)లో కూడ యిదే పద్ధతి నవలంబిస్తాడు. ఈ పద్ధతి నాటకీయ ఔచిత్యమనే శ్రేష్ఠగుణాన్ని సంతరించి పెడ్తుందని రచయిత లంటారు. ప్రతివ్యక్తీ తన దృక్కోణంనుంచీ సంఘటనలను వివరిస్తూ వుంటాడు; ఆ పాత్రలకు ఉచితమైన భావములను వ్యక్తపరుస్తూ వుంటారు; ఒక ముఖ్యపాత్ర, యింకో పాత్ర గురించి యెట్లా ఆలోచిస్తుందో కూడ సూటిగా మనకు తెలుస్తుంది. అయితే ఈ పద్ధతిలో మౌలికమయిన లోపం వున్నది. ఇది ఒకరకంగా కృత్రిమంగా కనిపిస్తుంది. ఎందువల్ల నంటే పాత్రలన్నీ సంఘటనలు పూర్తిఅయిన తరువాత ఒక కూటమిగా ఏర్పడి, ప్రతి ఒక్కరూ తమ తమ కథలను తిరిగి చెప్పటానికై ఒక సహకార కార్యక్రమం చేపట్టినట్లనిపిస్తుంది. ఈ మొదటి పరిమితిని వదలివేస్తే కథ మెత్తగా, శక్తివంతముగా చెప్పినట్లు మనం ఒప్పుకోవలసి వుంటుంది. అక్కడక్కడా కథకు పునరుక్తి దోషం పట్టినా యిది చురుగ్గా పతాక స్థాయిని అందుకొంటుంది. మరల అంధబాలిక తన భావాలను, అనుభూతులను, ఆమె అనుభవాలవల్ల పరిమితమయిన చిత్రాలను గీయడంలో నాటకీయ ఔచిత్యం స్పష్టమవుతుంది. ఈ పద్ధతిలో

యింకొక మంచి లక్షణం వున్నది. ఆత్మీయంగా ఒకటయి, తిరుగులేని విధంగా ఒకరి కొకరు శత్రువులయిన అమరనాథ్, లవంగలతల మధ్య చిక్కులతో కూడిన సంబంధాన్ని యిది సంక్షిప్తముగా, శక్తివంతముగా తెలియపరుస్తుంది. వ్యక్తిత్వాల మధ్య ఘర్షణను రచయిత చెప్పడమనే అస్పష్ట మాధ్యమం ద్వారా కాక, పాత్రలే విస్పష్టంగా చిత్రీకరిస్తవి.

'కృష్ణకాంతుని వీలునామా' 'ఆనంద మఠం'వలె జనాదరణ పొందిన నవల. బంకించంద్రుని నవల లన్నిటిలోకి వివాదాస్పదమయిన నవల యిది. మతము, రాజకీయమువంటి బాహ్యప్రయోజనాలు లేకపోవడంతో యిది 'ఆనంద మఠం'తో భేదిస్తుంది. ఇది సంపూర్ణ కళాఖండం. ముఖ్యంగా ఘటనా ప్రాబల్యంతో, పాత్రల క్రమ పరిణామానికి సంబంధించిన సాంఘిక నవల యిది. దీని ప్రధాన ఆకృతిక లక్షణం—నిరాడంబరత. ఇది వ్యావహారిక భాషలో, ఆలంకారికము కాని శైలిలో వ్రాయబడినది; నిష్ఠురమైన వాస్తవిక ధోరణిలో వ్రాయబడటం వలన, ఈ నవలలో, ఊహాలోకాల్లో దాక్కొని సేద తీర్చుకొనే అవకాశం లేదు. కట్టుకథలూ, జ్యోతిశ్శాస్త్ర ప్రభావం లేకపోవడంవలన వాస్తవికతే రూపు దిద్దుకొన్నట్లుంటుంది. భ్రమర, రోహిణి, గోవిందలాలులకు సంబంధించిన ఒక కథమాత్రమే దీనిలో వున్నది. నవలను ఉద్వేగపూరితమయిన మలుపుకు త్రిప్పిన, కథకు విషాదపు ముగింపును చేకూర్చడంలో చురుకైన పాత్ర వహించిన నిశాంకరుడు కూడ, ఈ కథకు పరాయివాడుగానే వుంటాడు. అతని ప్రవేశం ఎంత అకస్మాత్తుగా జరుగు తుందో, అదే విధంగా నిష్క్రమణ కూడ జరుగుతూంది. చాల విషయాల్లో 'కృష్ణకాంతుని వీలునామా'తో పోలిన 'విషవృక్షం'లో హీరాదేవేంద్రుల ఉపాఖ్యానం ముఖ్య కథను ఆరంభింపజేయడానికి ఉపయోగపడుతుంది. అయితే 'కృష్ణకాంతుని వీలునామా'లో ఏ సంశ్లిష్టత వున్నా అది ఒక కథలో వచ్చిన సంశ్లిష్టత మాత్రమే.

గోవిందలాల్, భ్రమరల వైవాహిక జీవితం సుఖంగా సాగిపోతూ వుంటుంది. వారు పరస్పర గాఢానురక్తులై వుంటారు. వారి వైవాహిక జీవితంలో రోహిణి ప్రవేశం అపశ్రుతి పలుకుతుంది. రోహిణి జిత్తులమారి, సుందరియైన విధవ. రోహిణి గోవిందలాలు పట్ల గాఢముగా ఆకర్షితురాలై అతనిని తన మోహపాశములో బంధిస్తుంది. గోవిందలాల్, రోహిణులు లేచిపోయి దూరంగా వున్న ప్రసాద్‌పూర్‌లో ఒక పాడుపడిన యింటిలో కాపురముంటారు. ఆ యిల్లు అంతకు

ముందే వదలివెళ్లిన ఒక నీలిమందు తోటల యజమానిది. సమాజముతో సంబంధము లేకుండా, తమకు పూర్తిగా అపరిచితుడైన నిశాంకరుడు వారి యింటిలో ప్రవేశించేవరకూ కలసి వుంటారు. గోవిందలాల్ చాల అమర్యాదకరంగా, శిష్టాచారాలను పాటించకుండా నిశాంకరుని యింటినుండి వెళ్ళగొడతాడు. అయితే రోహిణికి అతనిపట్ల ఆసక్తి అంకురిస్తుంది; అతనితో రహస్యముగా కలియడానికి ఏర్పాటు చేసుకొంటుంది. వారు ఐదు నిమిషాలు కూడ ఒంటరిగా వున్నారో లేదో, గోవిందలాల్ రాక వారిని ఆశ్చర్యచకితులను చేస్తుంది. గోవిందలాల్ రోహిణిని యింటికి తీసుకువెళ్ళి ఆమెను చంపివేస్తాడు.

ముగింపు రోహిణిపట్ల న్యాయం చేకూర్చేటట్లుగా వున్నదా? అసలు విధవ ప్రేమలో పడటమే తప్పు - అందులో సాటి ఆడదాని కొంపకు నిప్పు ముట్టించిన విధవమీద ఎలాంటి సానుభూతి లేని సాంప్రదాయిక నైతికతకు తల ఒగ్గినట్లు లేదా యీ ముగింపు? గోవిందలాల్ ప్రేమలో తల మునకలవుతున్న రోహిణి, గోవిందలాల్‌ను వారసత్వం నుండి దూరంచేసిన వీలునామా దొంగిలించడానికై కృష్ణకాంతుని యింటిలో జొరబడిన రోహిణి, తన తీరని కోర్కెలనుండి పారిపోవడానికై ఆత్మహత్యకు సిద్ధపడిన రోహిణి, తన ఒంటరి, జారత్వపు జీవితంలో మొదట ప్రవేశించిన ఆగంతకుని ఆకర్షణకు లొంగిపోతుందంటే మానసికశాస్త్ర రీత్యా సమర్థింప తగినదేనా? అని శరచ్చంద్రచటర్జీ నాయకత్వంలో చాలమంది విమర్శకులు ప్రశ్నల వర్షం కురిపించినారు. అటువంటి ముగింపు విశాలదృష్టిలేని నైతిక దృక్పథంనుండి ఉద్భవిస్తుందనీ, అది నిజమైన స్త్రీత్వంపట్ల ఆచరించిన అపరాధమనీ శరచ్చంద్రు డన్నాడు. (ఆయన తన నవలల్లో స్త్రీత్వానికి చాల పెద్ద పీఠం వేసినాడు.)

కాని మనం స్త్రీత్వంపట్ల ఆదరణగాని, నిరాదరణగాని లేని నిశ్చల మనస్తత్వముతో జాగ్రత్తగా నవలను పరిశీలించినట్లయితే, మనకు కథా ప్రారంభములో కన్పించిన రోహిణి పట్ల యీ పరిణామం అననుగుణమయినదిగా కనిపించదు. కుందనందినివలె ఈమె సుకుమారిమైన ఆడపిల్ల యేమీ కాదు. తన లోపం ఏమీ లేకుండానే తనను సుఖసంతోషాలకు వంచిత చేసిన విధిమీద పగబూనిన, సునిశిత బుద్ధిగల స్త్రీ యీమె. ఆమె జీవిత లక్ష్యం సుఖపు అంచులు చూరగొనడం; ఈ వాంఛాపరితృప్తికై ఆమె యేపని చేయడానికైనా సిద్ధమే. ఆపరాని యీ కోరికపట్ల ఫలితమించిన ఆశాభంగం ఆమె నైతిక బుద్ధిని కృశింపజేసినది; ఆమె నిర్భయమైన

ప్రజ్ఞ, ఆమె వాంఛా సిద్ధికై పాటు పడుతుంది. ఆమె అంతకంటే మంచిదేమీ దొరకనపుడు పిల్లినైనా కామదృష్టితో చూస్తుందనీ, కోయిల అల్లరిపాట ఆమెలో ప్రేమ వాంఛలను ప్రదీప్తం చేస్తుందనీ బంకించంద్రుడు చమత్కారంగా అంటాడు. అటువంటి స్త్రీ నిజంగా సుఖకరమైన నిశ్చల గృహస్థ జీవితానికి అలవాటుపడితే, మన నైతిక ప్రకృతికే కాదు, రసాత్మక ప్రకృతికే అపవాదం వాటిల్లి నట్లయ్యేది. ఆమె తన కామ క్షుధను తీర్చుకోవలెననే పిచ్చి కోర్కెతో ప్రసాద్‌పూర్ పారి పోతుంది - అది ప్రేమ అనండి, కామం అనండి- దానిని ఆమె సంఘ మంగీక రించిన, మానవ ప్రకృతికి సహజమయిన రోజూ అవసరమయ్యే ఆహారం వలె విని యోగించుకోలేక పోయినది. మానవునిలో ఒకే ఒక సహజగుణం సాధన చేయబడి, ఆత్మ వ్యక్తీకరణకున్న యితర మార్గాలన్నీ నిరోధింపబడితే ఆ జీవితం అతనికి విసుగును కలిగిస్తుంది. గోవిందలాల్‌ను వ్యామోహింపజేసినంత తేలికగా ఆమె హరలాల్‌ను అంగీకరించగలిగినది; అటువంటి స్త్రీ ఇంకెవరైన తన నాకర్షింప గలిగిన యువకులపట్ల కొంత కుతూహలం- మరింత ఉద్రేకం వ్యక్తపరిస్తే అసమంజసమేమీ లేదు. ఆమె గోవిందలాల్‌పట్ల మనసులో అవిశ్వాసంగా ప్రవర్తించ వలెనని అనుకోకపోవచ్చును. తన జీవిత భాగస్వామి మనసు, వదలివేసిన భార్యపై లగ్నమై వుండగా, వైవిధ్యం, నూతనత్వం లేని శుష్కజీవితంలో ఊపిరాడక ఉక్కిరి బిక్కిరియైన రోహిణి, మొదటగా సంతోష సంభాషణలో ఒక పది నిమి షాలు సేద తీర్చుకోవలెనని అనుకొన్నది.

రోహిణి క్రమక్రమ ప్రవర్ధమాన వాంఛలను వర్ణించే నవలలో మొదటి భాగంలో కథాగమనం, తరువాతి భాగంకంటె మెల్లగా సాగుతుంది. కారణం, రోహిణి శీలాన్ని పూర్తిగా వెలువరించవలసిన ఆవశ్యకతయే— కథను హేతుబద్ధంగా ఆవిష్కరించడానికి, కథాసూత్రా లన్నిటినీ అనాచ్ఛాదితం చేయవలసి వుంటుంది. అయితే తరువాత మజిలీల్లో ఆ పద్ధతి అనుచితమే కాక విసుగు పుట్టించేదిగా కూడ వుంటుంది. అందువలన బంకించంద్రుడు కథనంలో క్రొత్త పద్ధతిని - సూచనల ద్వారా, చిహ్నాలద్వారా సాగిస్తాడు. గోవిందలాల్, రోహిణి నివసించిన గృహం, పరిసరాల వర్ణనలో కూడ ప్రాముఖ్యత వున్నది. ఆ పాడుపడిన భవంతి, అక్కడ జరిగిన పాత నేరాలకు సూచికంగా, మానవ స్థావరాలకు దూరంగా వుంటుంది. భవనం ప్రక్కగా ప్రవహించే చిన్న సెలయేరు కూడ సగం యెండిపోయి వుంటుంది. అవినీతికరమైన ఆ సాన్నిహిత్యంలో మధురత లోపించిన దంపతులకి మౌన సాక్షియైన సగం వట్టిపోయిన సెలయేరు సరియైన ప్రతీక. ఇంతలో

దృశ్యం అంతకంటే సూచనాప్రాయమైనది. ఎప్పుడో లెక్కలు సరిచేసుకోవడానికి వచ్చే దుకాణదారుడు తప్ప యింటికి వచ్చే అతిథు లెవరూ లేరు. గదులు అలంక రింపబడినవి. అయితే ఆ అలంకరణ ఎప్పుడూ మంచి అభిరుచినే వ్యక్తపరచదు. ఇంటి యజమాని తాను ఉంచుకొనిన పడతి ప్రేమలో లీనమయ్యే వున్నాడు. అయినా అతని మనస్సక్కడ లేదు. సంగీత పాఠం జరుగుతూ వుంటుంది. అది ఎవరికీ ఆసక్తి లేనిదిగా ఆ వర్ణన చెప్పకయే చెప్పుతుంది. ఇంటిలో ఉన్న ఇద్దరు సేవకులూ, సచేతనమయిన మనుషులవలె కాక, దయ్యాలవలె కనిపిస్తారు. అటు వంటి యింటిలో భ్రమర పేరును ఉచ్చరించడమే పిడుగుపాటువలె పనిచేస్తుంది; అన్నీ క్రమం తప్పిన పవుతవి. అలాంటి అవతారికకు నిశాంకునితోడి కలయిక సరి యైన పర్యవసానం. ఇక్కడ బంకించంద్రుని ఉద్దేశం బాధా, వాంఛాతప్తమైన మానవ కథను చిత్రించడమే కాని పాతివ్రత్యం, విశృంఖల ప్రేమ అనే ఆదర్శాల వ్యక్తీకరణ కాదు. ఆయన భ్రమరను ఉజ్జ్వలంగా చిత్రించినాడు. కాని 'విష వృక్షం'లో ఆమె ప్రతిరూపమయిన సూర్యముఖిలా భ్రమర ధర్మ స్వరూపిణి కాదు. ఆమె కుర్రతనపు మూర్ఖత్వంతో, పెడసరంగా, క్షమాగుణం లేని దానివలె కని పిస్తుంది. ఈ లోపాల మిశ్రమం ఆమెను పూర్తి మానవిగా కనిపింపజేస్తవి. రోహిణిలో నిర్మలమైన ప్రేమ వున్నది కాని ఆమె సంపూర్ణంగ ఎదగని మనస్సు గల స్త్రీ. ఆమె హృదయ గత భావాలకు ఆమె మేధస్సు ప్రతినిధిగా మాత్రమే పని చేస్తుంది. అయితే ఆమె రీతిలేని తనంలో కూడ యేకరీతిగా ప్రవర్తించటం గుర్తించ వలసిన విషయం. బంకించంద్రుడు తన నవల లన్నిటికంటే 'కృష్ణకాంతుని వీలు నామా'ను ఎక్కువ యిష్టపడతా డంటారు. మెచ్చుకునే ప్రతి వ్యక్తికీ తన అభీష్ట మయిన నవల వున్నప్పటికీ, 'కృష్ణకాంతుని వీలునామా' యిష్టపడటంలో ఆయనకు మంచి కారణా లున్నవి.

ఆ తరువాతి నవల 'రాజసింహుడు' (1882). ఇది చరిత్రాత్మక, ప్రచా రాత్మక నవల. ఆయన హిందువుల వీరత్వాన్ని ప్రదర్శించవలె ననుకొనినాడు. తన అభిలాషకు అవలంబన వస్తువుకై రాజపుత్ర వీరులవైపు దృష్టి మళ్ళించి నాడు. మత దురాభిమానం గొప్ప సామ్రాజ్యాన్నెట్లు క్షీణింపజేస్తుందో కూడ సూచింప యత్నించినాడు ఆయన; అందుకు ఔరంగజేబు చక్కని ఉదాహరణగా దొరికినా డాయనకు. ముఖ్య కథావస్తువయిన రాజపుత్ర, మొగలుల మధ్య యుద్ధం చరిత్రాత్మకమైనది. ఆయన దానిని ఎన్నో ఆధారాలనుండి గ్రహించి నాడు. అందువల్లనే- బంకిం చంద్రుడే 'రాజసింహుడు' ఒక్కటి [illegible] తన

చరిత్రాత్మకమైన నవలగా గణించినాడు. కాని ఇది చాలమంది వ్యతిరేకించే అభి ప్రాయం- 'దుర్గేశనందిని,' 'చంద్రశేఖరుడు' నవలల్లో ముఖ్యకథ చరిత్రాత్మకం కానప్పటికీ బంకించంద్రుడు చరిత్రలోని మృతవ్యక్తులకు జీవితాలు ప్రసాదించ డంలో సఫలు డవుతాడు. మొదటి తురుష్క దండయాత్ర కాలంలో వంగదేశపు క్షీణదశను, ఆ వాతావరణాన్ని "మృణాళిని"లో విశ్వసనీయంగాచిత్రించినాడు. ట్రవెలియన్ భాషలో చెప్పాలంటే - ఈ రచనలో సంఘటనలు చరిత్రాత్మకం కానప్పటికీ అవి చరిత్రతు అద్దం పట్టిన అద్భుతమైన అనుసరణలు. 'రాజ సింహుడు'లో ప్రచారోద్దేశంతో దారి తప్పి ఆయన ప్రధాన కథలో ఆత్మవంచనకు పాలుపడిన వ్యక్తిగా కనిపిస్తాడు. టాడ్, జర్మ్, మనస్సీ వ్రాతలను అవిమర్శకంగా గ్రహించి, ఔరంగజేబును, వార్ధక్యముచే మతి తప్పిన బలహీనునిగా ఆయన చిత్రించినాడు. బంకించంద్రుని ఔరంగజేబు ఇటు తన అంతఃపురాన్ని శాసించ లేడు, అటు శత్రువులను జయించలేని బలహీనుడు. జర్మ్ చారిత్రాత్మక ఖండికలు ఖండికలే కాని చరిత్రకాదు. విచక్షణ గల ఏ పాఠకుడయినా టాడ్ లేఖినిని చరిత్రకంటె కల్పితగాథగా చూడగలడు. ఇక మనుస్సీదారుకు, అతని కుటుంబానికి రాజవైద్యుడు. అందువలన అతని దృష్టి మత్సరగ్రస్త మవుతుందన్న ఆలోచన బంకిం చంద్రున కెందుకు రాలేదో మరి? ఔరంగజేబు కడమ విషయాల్లో ఎట్లా ఉన్నప్పటికీ బలహీనుడు మాత్రం కాదు. నిజంగా మేధా సంపదలోను, శారీరక శక్తిలోను భారతదేశ పరిపాలకులలో అతనికి సాటివచ్చేవారెవరూ లేరు. కాని యీ నవలలో అతడు స్త్రీల చేతి కీలుబొమ్మగా కనిపిస్తాడు. త్రాగి మత్తెక్కిన ఉదయ పురిపై వలపులు గురిపిస్తాడు; తాను గాఢమత దురభిమాని యైనప్పటికీ తన హిందూరాణిని ఆచారపరురాలైన హిందూ స్త్రీగా జీవించ సమ్మతిస్తాడు. ఇది నవలాకారుని కల్పన. ఒక ఉత్సాహవంతురాలైన రాజపుత్ర బాలిక అతని రాజ ప్రసాదంలోనికి వచ్చినవుడు, అతడామె పన్నుగడలకు లోబడిన తెలివి తక్కువ వాడుగా చిత్రించబడినాడు. బంకిం చంద్రుడు పర్వత కనుమలలో జరిగిన పోరా టాన్ని అతిగా వర్ణించినాడు. ఆ యుద్ధంలో ఔరంగజేబు రెండురోజులు బంధితు డయ్యి, పూర్తిగా రాజసింహుని దయపై ఆధారపడినట్లు చిత్రించబడినది. ఇది జర్మ్ లేఖినినుండి అవిమర్శకంగా తీసుకున్న ఊహాగాథ. ఇది ఆధునిక చరిత్ర కారులైన జదునాథ సర్కారువంటి వారిచే తిరస్కరింపబడినది.[1] ఇంకొక

1. అయితే సర్కార్ 'రాజసింహ' నవలను నిజమైన చారిత్రాత్మక నవలగా పరిగణించినాడు.

విషయం కూడ చెప్పవలసి వుంటుంది. బంకిం చంద్రుని కాలంలో మధ్యయుగపు భారత చరిత్రపై ప్రామాణికుడయిన చారిత్రకుడు ఎల్ఫిన్‌స్టోన్ యీ విషయాన్ని అలక్ష్యం చేసినాడు.

రాజసింహ, ఔరంగజేబులకు మధ్య జరిగిన యుద్ధాన్ని వర్ణించేటప్పుడూ, మాణిక్‌లాల్, నిర్మలకుమారి సృష్టిలోను వారి అద్భుత కృత్యాలను వర్ణించేటపుడూ బంకిం చంద్రుడు తన ప్రచార కుతూహలం వలన, కట్టుకథలమీది ప్రేమవలన దారి తప్పినాడు. అయితే 'రాజసింహుని'లో గొప్పదనం, శక్తిలేదనే అభిప్రాయానికి రావలసిన అవసరం లేదు. రవీంద్రనాథటాగూరు బంకించంద్రుని విశాల చిత్రపటాన్ని, ఒక కథనుండి ఇంకొక కథలోనికి చొచ్చుకొనిపోయే చురుకైన, శక్తివంతమైన ఆయన కథా కథనాన్ని మన దృష్టికి తెచ్చినాడు. కళాత్మకంగా మనలను కదిలించేది ముబారక్, జేబున్నీసా, దరియాల ఉపాఖ్యానం. అయితే ఇక్కడ కూడా ముబారక్ పునరుజ్జీవింపబడటం అనే కట్టుకథ మనకు కనిపిస్తుంది. ముబారక్ విధి చోదితుడై, ఇద్దరు అసాధారణ యువతుల కోరికల తుఫానులో చిక్కుకొనిన వ్యక్తి. అందులో ఒకస్త్రీ సమాజపు నిచ్చెనపైన, మరొక ఆమె నిచ్చెన క్రింద ఉంటారు. అయితే ఇద్దరు ఒకే పురుషుని ప్రేమించటం వలన, యిద్దరూ ఒకే సాధారణమయిన స్థితికి చేరినారు. దారియాది ఆవేశోల్లసితమైన ప్రేమ, జేబున్నీసా ప్రేమ కుటిలమైనది. పొట్టిదారియా వీరోచిత రీవితో స్పష్టాస్పష్టంగా భావిస్తే, శక్తివంతుడైన చక్రవర్తియొక్క శక్తివంతురాలైన తనయ జేబున్నీసా, తానూ సాధారణ మానవులకు భిన్నం కానని తెలుసుకుంటుంది. ఆ యిద్దరి మధ్య వీరుడైన ముబారక్ మంత్రబద్ధుడై నిస్సహాయుడైనట్లు, నిద్రలో నడిచే వ్యక్తి వలె ఉంటాడు. తిరుగలేని బాధాకరమైన విధి విధానంలో, సాలెగూడులో చిక్కుకున్న పురుగువలె ముగ్గురూ తిరుగుతూ వుంటారు. ప్రధాన కథలో రచయిత దృష్టి సంఘటనల నడకపై కేంద్రీకరింపబడటం వలన టాగూరు అన్నట్లు, అక్కడ సున్నితపాత్ర చిత్రణ కవకాశం కలుగదు, అయితే ముబారక్ ఉపాఖ్యానంలో మానవత ఉట్టిపడుతున్నట్లుగా ఉంటుంది. ఉద్రేక జనకమయినప్పటికి యుద్ధ కథ జీవితపు అంచులను మాత్రమే తాక కలదు; అటువంటి కథకు ముబారక్ ఉపాఖ్యానం ఔన్నత్యాన్ని, గాఢతను కలిగించినది.

బంకించంద్రుని నవలాకారుడుగా మనం పరిశీలించే క్రమంలో ఆయన మధ్యకాలపు రచనల్లో మూడు చిన్న కథలు- 'ఇందిర' (1873), 'అంగుళీ

ద్వయం' (జుగలుంగరీయా) (1874), 'రాధారాణి' (1877)-లను గురించి కూడ కొంత చర్చించవలసిన అవసరం ఉన్నది. నవలలోవలె చిలవలు పలవలుగా సాగే కథ ఒక సంఘటనపై నిర్మితమైనదీ చిన్నకథ; దాని ఆసక్తి అంతా ఒకే బిందువుపై కేంద్రీకరింపబడి ఉంటుంది; దీనిని ఒక నిప్పు రవ్వతో పోల్చవచ్చును; ఇది ఒక్కసారిగా వెలిగి ఆరిపోయే గుణం కలిగిఉ న్నది; చిన్నకథ అనే సాహిత్య ప్రక్రియను యీ లక్షణాలు కలదిగా గుర్తించవలసి ఉంటుంది. అయితే యీ పై కథలు సరిగ్గా అటువంటి నిర్వచనానికి సరిపోవు. ఆయన చిన్న కథలు అట్లా ఒక విషయంపై కేంద్రీకరింపబడలేవు. మామూలు నవల లక్షణాలు సంతరించుకొన్న చిన్న నవలలు యివి. కథలో వానికంటే చిన్నవీ అల్లిక తక్కువైనవీ మాత్రమే. అవి కల్పనా గాథలు. బంకించంద్రుడే వాటిని కట్టు కథలుగా ('ఉపకథలు'గా) పేర్కొనినాడు. ఆయన పెద్ద నవలల్లో ఇంతకు క్రితం మనం చూచినట్లుగానే కట్టు కథల ప్రాబల్యం వున్నప్పటికి, అక్కడ అవి మానసిక శాస్త్ర దృష్టితో 'సంభవ ములు, అవసరములు.' అన్న జ్ఞానంతో సేమితమయి వున్నవి. ఈ 'ఉపకథ'ల్లో ఊహ రాజ్యం చేసినది.

వీటన్నిటిలోకి బలహీనమయిన 'రాధారాణి'ని గురించి విశదంగా చర్చించ వలసిన అవసరం లేదు. కథలో ప్రతి అడుగూ హేతురహితమైనదిగా, అసంభవ మైనదిగా కనిపిస్తుంది. వాస్తవికతా దృష్ట్యా చిత్రీకరణ కూడా కథ నిరర్థకత్వాన్ని పెంపొందింప చేయడానికే ఉపయోగపడుతుంది. కాని 'అంగుళీద్వయం' సంభ వముగా గల అసంభవ కథ. తామ్రవిప్తనావికాశ్రయంగా ఉచ్ఛదశలో ఉన్న కాలంలో వంగదేశం దూరంగా ఉన్న శ్రీలంకతో వర్తక వాణిజ్యాలు అవిరళంగా జరుపుతున్న సుదూరకాలపు కథ యిది. ఇప్పుడు చాలమందికున్నట్లుగానే ఆ కాలపు ప్రజల్లో కూడ జ్యోతిష్యంలో ప్రగాఢ విశ్వాసముంది. అయితే మానవుల చర్యలకు, పైని నక్షత్రాల నడకకు మధ్యగల అద్భుత సామరస్యం మన మనసు నాకట్టుకొంటుంది. వరుడు, వధువుల కళ్ళకు గంతలు కట్టి వుండగా వారి వివాహం జరుగుతుంది. వారు ఒకరి నొకరు ఎరుగరు. అయిదు సంవత్సరాలు గతించి పోతవి. అప్పుడు వారికి జరిగిన పరిచయంలో— అది ప్రణయంతో ప్రారంభమై పెళ్ళిగా పరిణమించిన కథగా ఋజు వవుతుంది. కారణం వరుడు, వధువు— పురందర్, హిరణ్మయిలు అంతకుముందే ఎన్నో సంవత్సరాలనుండి ఒకరి కొకరు పరిచితులు. ఇంతకాలం హిరణ్మయి అపవిత్రంగా భావించిన అక్రమ సంబంధం చివరకు అచంచలమయిన పాతివ్రత్యంగా పరిణమించినది. కథ ఎంత నేర్పుగా

చెప్పబడినదంటే, మూలభూతమైన కథలోని అసంభవత్వం, ఊహాలోకంలో తేలే అపశృతిగా మనకు వినిపించదు. బాధించే కథ తిరిగే మలుపులు విచిత్రమయిన సమకాలిక సంఘటనల వెనుక, పురందరుని పట్ల హిరణ్మయి అనురాగం అచంచలంగా, అక్షీణంగా ఉండిపోతుంది. ఆమె సంకోచాలు, సర్దుబాటులు, చివరకు అపాతివ్రత్య ప్రవర్తనను అంగీకరించటం. ఉత్కంఠతో చదివిన మనకు, మంచి ఉపశమనం కలుగుతుంది.

'ఇందిర', 'అంగుళీద్వయం' కంటే పెద్దదీ, చాల చక్కగా ఉజ్జ్వలంగా వ్రాయబడిన కథ. కలకత్తా గొప్ప నగరంగా అభివృద్ధి చెందుతున్నప్పుడు, ఎక్కువ కాలం క్రిందగాక ఇటీవలే జరిగిన సంఘటనల కథ యిది. ఇంకా గ్రామాలు బందిపోటుల బారినుండి తప్పించుకోలేదు. రైలుమార్గాలు లేకపోవటం వలన పల్లకిలలో ప్రయాణాలు ప్రమాద భూయిష్టములై ఉన్నవి. ఇందిర పెండ్లి జరిగి ఎనిమిదేండ్లయినది. పెండ్లి కాగానే ఆమె భర్త ఉద్యోగాన్వేషణలో వెళ్ళిపోయినాడు. వాళ్ళు కలుసుకోలేక పోయినారు. ఇందిర తండ్రి యింటిలోలోటులేని జీవితం గడుపుతున్నప్పటికీ విషణ్ణ హృదయంతో ఒంటరితన మనుభవిస్తూ వుంటుంది. అప్పుడు ఆమె భర్త తన యింటికి తిరిగి వస్తాడు. ఆమె భర్తృసమాగమానికై ఆనంద విహ్వలయై ప్రయాణం చేయడంతో కథ మొదలవుతుంది. మార్గమధ్యంలో బందిపోటులు వీరిని ఎదుర్కొనడం ఆమెను దోచుకొని దట్టమైన అడవిలో వదలివేయడం జరుగుతుంది. ఇందిర ఇపుడు సాహస కృత్యములతో కూడిన సుదీర్ఘ ప్రయాణం సాగిస్తుంది; ఎన్నో పరిస్థితుల నధిగమించి చివరకు భర్తను కలుస్తుంది. ఒక్కసారిగా ముగించవలసి వస్తుందేమో అన్న దృష్టితో బంకించంద్రుడు వివిధములైన చిన్న ఉపాఖ్యానాలను ప్రవేశపెట్టి కథను పెంచినాడు. శీల పరీక్ష జరిగిన తరువాత ఒకనాటి వధువు, వరుడు భార్యాభర్త లవుతారు. కథ మొదటి భాగం ఉజ్జ్వలంగా వుంటుంది. ఇందిర ఆశ్రయం పొందుతున్న ఇంటికి ఆమె భర్త రావటంతో కథలో మన ఆసక్తి సన్నగిల్లుతుంది. దీని తరువాత కథ కృత్రిమంగా, ఒకోసారి మొరటుగా మన మనసు నాకట్టుకునే ప్రయత్నం చేస్తుంది.

'ఇందిర' కథ రమ్యమైనదే, అయినా దానిలో విషయం కంటే కథా కథనం గుర్తింపదగినది. తన అన్వేషణ విజయవంతంగా పూర్తియైన పిమ్మట, ఇందిరే తన కథ చెప్పినట్టు ఒక చిన్న నవల వ్రాయబడినది. ఆమె కథ చెప్పటం

వలన, ఆమె తెలివి తేటలు, చైతన్యం, తను చెప్పే సంఘటనల్లో జీవితంపట్ల ఆమె కున్న సమగ్రదృష్టి, ఆమె ఉపయోగించిన అర్థవంతమైన ప్రతీకలు మనకు అవగత మవుతవి. కథ ఆదినుండి అంతం వరకు జీవస్ఫూర్తితో వెలిగిపోతుంది. పైనచెప్పి నట్లు కథాంతంలో మనను ఆకట్టుకొనే శక్తితగ్గిపోయినా, ఆమె సంతోషం, ఉజ్జ్వల కథా కథన శక్తి కథకు బలాన్నీ, ప్రౌఢత్వాన్నీ కలిగిస్తవి. ఈ ఉజ్జ్వల కథా కథనం వ్రాయవలెనని కూర్చుని వ్రాసినట్టు, కృత్రిమాలంకారములతోగాక స్వప్రేరణతో గట్లు తెంచుకొని పారే ఉత్తుంగ తరంగిణి అయిన జీవనది వలె ప్రవ హిస్తుంది. నవల ప్రాముఖ్యతను వివరించటానికై బంకిం చంద్రుడు తొలి పలు కుల్లో షెల్లీ పలుకుల నుట్టంకించినాడు.

ఎప్పుడో, ఎప్పుడో వచ్చెదవు నువ్వు
ఓ ఆనంద దేవతా!

ఇందిర నిజంగా ఆనంద దేవతా స్వరూపమే. ఆమె పాత్ర, మాటలు చిత్రించగలిగినంతవరకు, వంగ సాహిత్యంలోని మిరుమిట్లు గొలిపే పాత్రలలో ఒకటిగా ఆమె చిరకాలం నిలిచిపోతుంది.

# 4

# చివరి దశ నవలలు

తన చివరదశ నవలల్లో — 'ఆనంద మఠం' (1882), 'దేవి చేధరాణి' (1884), 'సీతారామ్' (1887)-మళ్ళీ బంకించంద్రుడు చరిత్రనుండి కథా వస్తువును గ్రహించినాడు. అయితే చరిత్రకు ఎన్ని మార్పులు, కూర్పులు, చేర్పులు చేసినాడంటే, ఆయనే యీ నవలలను చరిత్రాత్మక నవలలుగా పరిగణించవద్దని పాఠకులను హెచ్చరించినాడు. అయితే ఈ నవలను ఒక కథ చెప్పడమో, ముఖ్యంగా శీల చిత్రణ చేయడమో ఉద్దేశంగా గల కల్పిత కథలుగా మనం పరి గణించకూడదు. అవి భావ ప్రతిపాదనకై ఉద్దేశించిన నవలలు. మనసు నుల్లాస పరచే సంఘటనల అభావం లేనప్పటికీ, కొన్ని పాత్రల చిత్రణ శక్తివంతముగా

వున్నప్పటికి, ఘటనలు, పాత్రలు, మత, తాత్త్విక రాజకీయ భావాలకు ప్రతీకలుగా మాత్రమే ఉద్దేశింపబడినవి.

ఈ కాలపు నవలల్లో అఖిల జనాదరణ పొందినది 'ఆనంద మఠం' ఇందులో 1770 లోని వంగదేశ క్షామం, దానివలన జరిగిన సన్యాసుల విప్లవం ప్రాతిపదికలుగా కథ మొదలవుతుంది. కరువునూ, అప్పటి అరాజక పరిస్థితుల వివరణను చాల ఘోరంగా చిత్రించినప్పటికీ, బంకించంద్రుడు ఈ విప్లవాన్ని గుర్తించలేని విధంగా మార్పు చేసినాడు. పాత్రల సృష్టి చరిత్రాత్మకం కాదు, ఊహాజనకమైనది. ఆపైన మత, రాజకీయ పునరుద్ధరణాభావమే చరిత్రలో ప్రసంగిత విషయం కాదు. మనకు లభ్యమయే చారిత్రక ఆధారాల ప్రకారం, సన్యాసులు, ఫకీరులు వంగదేశీయులు కారు; పైగా వారు తిరిగిన ప్రదేశం సరిగ్గా వంగదేశంలోనిదీ కాదు. జాధునాథ సర్కార్ అన్నట్లు వారు పూర్తిగా సాధారుణులైన దొంగల ముఠా, ధర్మరక్షణ ప్రాతిపదికపై రాజ్యం నిర్మించాలన్న ఊహే వారికి లేదు. కాని నవలకు కల్పింపబడిన చారిత్రాత్మక పూర్వరంగము అసలు అబద్ధము కాదు. ఆపైన ఈపూర్వరంగము దృక్పథమునుండి తప్పిపోవటం వలననే ఈ గొప్ప నవలపై వచ్చిన చాల భాగం విమర్శ దారి తప్పింది. చరిత్రే కథా పరిధిని నిర్ణయిస్తుందన్న అంశం వారి దృక్పథం నుండి తప్పిపోయింది. ఇల్‌బర్ట్ బిల్లు కారణంగా ప్రారంభమైన ఉద్యమ సమయంలో (భారత జాతీయ కాంగ్రెసు యింకా మూడేళ్ళకు స్థాపింపబడుతుందనగా) 'ఆనంద మఠం' 1882 లో ప్రచురితమైనది. ఈ నవల భారతదేశానికి జాతీయ గీతాన్నందించినది. కాని ఈ గేయం నవలకంటె ముందుగానే రచితమైనది. పునరుజ్జీవింపబడిన భారత ప్రజానీకం ఏక కంఠంగా యెలుగెత్తి ఆలపించిన ప్రజావాణియే ఈ గేయం. అయినా కథను గట్టి చట్రములో యిముడ్చవలసి వున్నది. లేకపోతే అది గాలి నింపినట్లు, ఊహ జనితంగా కనిపిస్తుంది. తురుష్క ప్రభావం క్షీణదశలో వున్నది; ఇంకా ఆంగ్లేయులు ఆ అరాజక పరిస్థితిని సరిదిద్దని కాలం, ఇటీవలి వంగదేశపు వాతావరణం దీనికి సరియైనది. విప్లవాత్మక నవలకు ఈ పూర్వరంగము ప్రాంతీయత నాపాదిస్తుంది. ఈ చట్రంలో విప్లవకారులు, చారిత్రక నవలలోవలె సంబద్ధముగా సృజింపబడినట్లయితే - విప్లవకారుల పరిపాలనను రాజకీయ స్వాతంత్ర్యాన్ని పునరుద్ధరించిన హిందూజాతి ప్రభుత్వంగా భావించేటట్లు చేయవచ్చును. అయితే ఒక తెగకు, జాతికి సంబంధించిన ధూ తేర్పాటు వాదం (Sectarianism) సందర్భవశాన వచ్చిన కథా [illegible] భావానికేమీ సంబంధములేనిది 'వందేమాతరం'

మొదటి పంక్తుల్లో పర్వతమయమై, సైకత శ్రేణులతో నిండిన రాజస్థాన ప్రాంతము కాక సస్యశ్యామలమయిన వంగదేశమును వర్ణించడం, ఆ గేయం ముప్పై లేక నలభై కోట్ల భారత ప్రజలను కాక ఏడుకోట్ల వంగీయుల నుద్దేశించి వ్రాయబడటం మనం అలక్ష్యం చేస్తాము. అదే విధంగా నవలలో ప్రతిపాదించబడిన ఆదర్శాన్ని పరిగణించేటప్పుడు చారిత్రక చట్రం నవలకు ఆపాదించిన పరిమితులను విస్మరించవలసి వుంటుంది; లేకపోతే ఆ చట్రపు (బాహ్యాముఖ) విలువలతోనే పరిగణించవలసి వుంటుంది.

ఈ నవలలోని మౌళిక ఆదర్శసూత్రా లేమిటి? బంకించంద్రుడు ఎట్లా యీ పవిత్ర కార్యాన్ని, కవి కలలను పండించి, మూర్తిమంతం చేసినాడు? అన్న ప్రశ్న లుత్పన్న మవుతవి. ఆనంద మఠ స్థాపకుడయిన సత్యానందుడు తనను వైష్ణవ మతోద్ధారకునిగా పిలుచుకొంటాడు. ఈ వైష్ణవం శ్రీ చైతన్యుల సుతి మెత్తని, శాంతియుత వైష్ణవం కాదు. బంకించంద్రుడు తన 'కృష్ణ చరిత్ర'లో మతపరమైన వ్యాసాల్లో వెలువరించిన 'మహాభారతం'లోని మూల వైష్ణవం. ఇక్కడ భగవంతుడు ప్రేమమూర్తి కాదు, ధర్మమూర్తి. ఆయన తన శక్తివంతమైన చక్రాన్ని శిష్ట రక్షణకు, దుష్ట శిక్షణకు వినియోగిస్తాడు. చారిత్రక ప్రాముఖ్యత ఏమివున్నా, యిది మామూలు సాధారణ భావన. అందువలన దానంతటదే బంకించంద్రుని చిత్రణలోని ఔన్నత్యమును చెప్పలేదు. మౌలిక మయినదీ, విశిష్ట గుణాత్మకమయినదీ ఆయన దేశభక్తి భావన - దేశాన్నే తల్లిగా భావించే దార్శనిక దృష్టి. సంతానులు యీ తల్లి బిడ్డలు; వారు యింకే బంధాన్ని పరిగణించరు. తల్లిగా గృహస్థ జీవితంలోని పవిత్రతకు ప్రతినిధిత్వం వహిస్తుందామె; మత పరంగా గుణాతీతురాలు - ఏకేశ్వరి ఆమె; ఆమెను అధిగమించినదీ; ఆమె కంటె వేరైనదీ యింకేమీ లేదు; భగవంతుని పట్లగల మన సర్వభావనలకు మూర్తి రూపం ఆమె. ఏకేశ్వరిగా ఆమె సంకోచములేని విధేయత మనలనుండి ఆశిస్తుంది; సర్వబంధాలను, సర్వధర్మాలను పరిత్యజించి ఆమెనే అందరూ శరణు కోరవలెను. అందువలననే సంతానులు ప్రపంచమును జయించిన సన్యాసు లయినారు.

ఒక భావం ఎంత గొప్పదైనా జీవం కలిగిన ప్రతీకలలో ప్రతిష్ఠించబడ పోయినట్లయితే కళాత్మక సృష్టి జరుగదు. అందువలన కళ సంచలనాత్మకములూ, ప్రకాశవంతములూ అయిన పాత్రల నాశిస్తుంది. ఈ నవలలో కథ మహేంద్ర, [illegible]

చంద్ర, మృణాళినులవలె వారు కథ మొదలు పెట్టిస్తారు. వారు పురోభూమిక లోనికి తరచు ప్రవేశించినా వారి చరిత్రకు దానంటదే ఎటువంటి ప్రాముఖ్యత లేదు. కారణం - మహేంద్రుడు విప్లవంలో పాల్గొన్నప్పటికీ, అతడు సంతానుడు (ఆమాట ఖచ్చితమైన అర్థంలో) కాదు. సన్యాసుల సాహస కృత్యాలు, యుద్ధాలు శక్తివంతముగా వర్ణింపబడినవి. కాని వట్టి వర్ణన చిత్రణ కాదు. తల్లి పిలుపు ఎంత పూర్ణమయినదో, సమగ్రమయినదో సత్యానందుని ప్రధాన సైనికాధికారులైన భవానంద, జీవానందుల చరిత్రనుండి పరిశీలించవలసి ఉంటుంది. తల్లి సర్వ సంబంధాలను త్యజించి తనను శరణు కోరవలె ననుకుంటుంది. అయితే మానవుల ప్రాథమిక హృదయగత భావాలు కలిగించే తాపం ఉద్రేకపు తుఫానుల - లైగింక జీవగతాకర్షణ- సంగతి యేమిటి? నవల చివరి దృక్కోణం నుండి పరిశీలించితే, కళ్యాణి మహేంద్రుని భార్యగా కంటే, భవానందుని నమ్మకపు పునాదులను కదిలించిన స్త్రీగా ప్రాముఖ్యత పొందుతుంది. ఇక్కడ మనకు ఉత్కంఠ కలిగించే నాటకమే కాదు; అందరు విప్లవకారులూ ఎప్పుడో ఒకసారి జీవితంలో ఎదుర్కోవలసిన క్లిష్ట సమస్య వున్నది. ఇదే సమస్య యింకో రూపంలో జీవానందుని జీవితంలో కూడ ప్రత్యక్ష మవుతుంది. అతడు వివాహితుడు; తన భార్య శాంతిని చూపి శపథం భగ్నం చేసుకొంటాడు; అతని భార్య సన్యాసుల మతం స్వీకరించి. సంతానుల దండయాత్రలలో వీరోచితంగా పోరాడుతుంది; వారు పరస్పర వాంఛలకు దేశభక్తి మతమనే ఆదర్శాల అన్వేషణలో ఒక ఉదాత్తతను ఆపాదించుకొన్నట్లు కనిపిస్తారు. ఈ వాంఛలను ఆదర్శముగా మలచుకొనే కథ, కట్టుకథగా కనిపిస్తుంది. అయితే యీ కల్పనాగాథా వాతావరణం, సమస్యయొక్క సత్యాన్ని, అది అందించే సందేశాన్ని మరుగుపరచదు. ఒక విప్లవకారుడవడం, ఆపైన భార్య వుండడం చాల అసౌకర్యమైన ఏర్పాటని మనం గోర్కీ నవలలో చదువుతాము. బంకించంద్రుడు విషయాన్ని సౌకర్యమనే దృష్టి కోణాన్నుండే పరికించడు. విప్లవ కారునికి అన్నీ తన కౌగిలిలోకి తీసుకునేదిగా, సర్వ వ్యాపకురాలుగా, మిగతా అన్నిటిపట్ల విశ్వాసాన్ని నిషేధించే దేవతగా తల్లి భాసిస్తుంది. అక్కడ సంఘర్షణ, దుఃఖం, వాంఛలను ఆదర్శవైపు మళ్ళించుకోవడమేగాని రాజీ ప్రసక్తిలేదు.

'దేవి చౌధరాణి' చారిత్రికాధారం 'ఆనంద మఠం' కంటే అస్పష్టమైనది. వారన్ హేస్టింగ్స్ భారతదేశంలో బ్రిటిషు పాలనా యంత్రాంగమును పటిష్ఠం చేయకముందు, తురుష్క పాలనాకాలపు చివరి దినాల అరాజక పరిస్థితుల గురించి ఈ నవల చెప్తుంది. దుష్టపాలనకు లోనయి, అరాజకత్వం వ్యాపించిన పరిస్థితు

లలో వంగదేశములోని కొన్ని జిల్లాలు బందిపోటు దొంగల దోపిడులలో విధ్వంసము చేయబడినవి. హంటర్ తాను వ్రాసిన "వంగరాష్ట్రపు సంఖ్యా పరిశీలన శాస్త్ర లేఖిని ఏడవ భాగంలో (Statistical Account of Bengal Vol. Vii) యిద్దరు దొంగల పేర్లు పేర్కొనినాడు. ఒకరు భవానీ పాఠక్, రెండవ దొంగ పరస్పర ప్రయోజన సాధనకై అతనితో చేయి కలిపి, పడవలలో నివసించే దేవి చౌధరాణి అన్న పేరు కల స్త్రీ; ఇక్కడితో ముఖ్యపాత్రల చరిత్రాత్మికత ఆగిపోతుంది. చరిత్రలో పాఠక్, బంకించంద్రుడు చిత్రించినట్లు పండితుడూ కాదు, దయాపూరిత హృదయము కలవాడూ కాదు; మనకు తెలిసినంతవరకు దేవి చౌధరాణి నిజంగా జనాన్ని దోచినది, కొల్లగొట్టినద్ది- అట్లా చేసినట్లు ప్రదర్శన మాత్రమే చేయలేదు. నవలలో అరాజక పరిస్థితి విపులంగా, నిర్దుష్టముగా చిత్రింపబడినట్లు చరిత్రకారులు అభిప్రాయపడినారు. అయితే పాత్రలు ప్రాతినిధ్యం వహించిన భావాలు బంకిం చంద్రుని సొంతం.

ఇంతకుముందే చెప్పుకున్నాం- ఆయన చివరి నవలలు భావ ప్రతిపాదనకై రచింపబడినవని అందువలన విమర్శనాత్మకంగా విశ్లేషణ చేయడం భావాలనుండి కథవైపు, పాత్రలవైపు సాగవలెగాని, కథ, పాత్రలనుండి భావాలవైపునకు కాదు. తన మత పరమైన వ్యాసాల్లో తాత్త్విక చర్చ జరిపిన సాంస్కృతిక మతమును బంకించంద్రుడు నవలల్లో నిక్షేపింప దలచినాడు. అసలు సంస్కృతి అంటే ఏమిటి? మతమంటే ఏమిటి? శారీరక, రసాత్మక ఆధ్యాత్మిక నిగూఢ శక్తుల సామరస్య పూర్ణ వికాసనమే సంస్కృతి లేదా మతము. దీనికి ఫలమేమిటి? స్వార్థ పూరితమైన సమస్త వాంఛలపై విజయం పొందటమే దీని ఫలం; పురుషుడు కాని స్త్రీ కాని వ్యక్తిగత ప్రతిఫలాన్ని ఆశించక విద్యుక్త ధర్మముల నాచరించవలెను. ఈ పరిస్థితిలో మన చర్యలు అన్నీ భగవంతుని వైపు మరలుతాయి. సాంఘిక ధర్మాలనుండి విముక్తిని కలిగించే సన్యాసం కాక, ప్రపంచములో సంబంధము కలిగివుండే విద్యుక్త ధర్మాలను ఆచరించడంలోనే యీ మతమును చక్కగా అనుష్ఠించడ మవుతుంది. గీతనుండి మన కందే సందేశం యిదే. అదే కృష్ణ భగవానుడు 'మహాభారతం'లో ప్రబోధించినది. తరువాత రవీంద్రనాథ ఠాగూరు అన్నట్లు- 'విముక్తి ఎక్కడ లభ్యమవుతుంది విముక్తి? మన ప్రభువే సంతోషంగా సృష్టి బంధనాలు తగిలించుకున్నాడు; ఆయన ఎప్పటికీ మనతో బంధింపబడి వున్నాడు.'

భవానీ పాఠక్ ఈ మతమును ప్రబోధిస్తుంటే, ప్రఫుల్ల అట్లా జీవిస్తుంది. ఆమె మామగారు ఆమె తల్లిని గూర్చిన (అధార రహితమయిన) నిందను వినడం వల్ల, ఆమెకు భర్తయింట స్థానం లేకుండా పోయింది. ఆమె అకస్మాత్తుగా అధిక ధన సంపదలతో వస్తుంది; గొప్ప బందిపోటు నాయకుడైన భవానీ పాఠక్‌తో కలియడం జరుగుతుంది. అతడు ఆమెను తీర్చిదిద్ది, ఆమెలో గల నిగూఢ శక్తులను సామరస్య పూర్ణంగా వికసింపజేస్తాడు. ఆపైన ఆమెను దేవి చౌధరాణిగా శిష్ట రక్షణ దుష్ట శిక్షణ అనే విశిష్ట ధర్మాలను ఎటువంటి వ్యక్తిగత ప్రలోభం, భయంలేని అనుద్వేగ పూర్ణమయిన మనస్సుతో నిర్వర్తించడానికి ప్రపంచముపై వదలి వేస్తాడు. ఆమె దర్పంతో, ఆపైన వినయంతో ఒక చక్రవర్తినివలె, సన్యాసి వలె ఈ ప్రయోజనాలను సాధిస్తుంది. అప్పుడు చాలకాలం తరువాత ఆమె తన భర్తను కలుసుకోవటం తటస్థిస్తుంది. అంతవరకు అణగివున్న ఆమెలోని సతీత్వ ప్రవృత్తు లొక్కసారిగా మేల్కొనినవి. అంటే భవానీ పాఠక్ బోధించిన ధర్మముల పట్ల ఆమెకు విరక్తి కలిగినది. ఆమె వాటి సాధనకై యిక ప్రయత్నించేసే స్థితిలో లేదు. మొదట తనను ఆంగ్లేయులకు అప్పగించుమని వారిచే బహిష్కృత వ్యక్తిగా ఉరితీయబడవలెనని కోరుకుంటుంది. కాని తన భర్త యిప్పటికీ తనను స్వీకరిస్తా డనే విశ్వాసం ఆమెలో బ్రతకవలెననే ఆకాంక్షను రేకెత్తిస్తుంది. సమయానికి వచ్చిన తుఫాను- భగవంతుని చమత్కృతి- ఆమెను రక్షిస్తుంది. ఆమె భర్త యింటికి తిరిగి వెళ్తుంది. అచట తన అల్పమైన ధర్మ నిర్వహణలో సుఖపడు తుంది. అయితే అక్కడ కూడ అనాసక్త కావటం వలన నక్షత్రం వలె సుదూ రత్వాన్ని అలవరచుకొంటుంది. కోప స్వభావం కలిగిన ఆమె సవతి నయనతారతో సహా అందరూ ఆమె వలన సుఖపడతారు. ఇక్కడి ఆనందపు శతాధిక బంధనా లలో ఆమెకు నిజమైన విముక్తి, సంతోషం లభ్యమవుతుంది.

నవలలోని సాంఘిక, గృహస్థ జీవిత దృశ్యాలు సుందరంగా, రమ్యంగా ఉంటవి. ప్రకృతి, అరాజక పరిస్థితి శక్తివంతంగా, ఉజ్జ్వలంగా చిత్రించబడినవి. అయితే రచయిత ప్రధానోద్దేశం- సాంస్కృతిక మతమును మూర్తివంతం చేయడం- కుదుర్చుకుపడినట్లు నేర్పులేని విధంగా ప్రదర్శింపబడినది. సుదూర భూతకాలంలో కథ జరిగే చరిత్రాత్మక నవలలో కాల్పనికత్వాన్ని సహించవచ్చును గాని, గార్హస్థ్య జీవిత కథలతో ఇది ఒక విధంగా అసమంజసంగా కనిపిస్తుంది. తుఫాను ఉపాఖ్యానం-అది ప్రఫుల్లను రక్షించేందుకే భగవంతుడు పంపినట్లుగా మనం నమ్మ వలసి వుంటుంది-లో ఈ కాల్పనికత పతాక స్థాయిని చేరుకొంటుంది. ఇది విడచి

పుచ్చినా దేవి చౌధరాణిగా ప్రఫుల్ల జీవితం యేమాత్రం వాస్తవికంగా కనుపించదు. ఐదేళ్ళు ఆమె మల్లయుద్ధం నుండి తత్త్వశాస్త్రం వరకు సుదీర్ఘమయిన శిక్షణ పొందుతుంది; అప్పుడు ఆమె తన రాణి ధర్మాలను నిర్వర్తించడం మొదలు పెడుతుంది. ఇవ్వదలచుకొన్న సందేశానికి ప్రాణమయిన ఆకాలపు కార్యకలాపాలకు సంబంధించిన కథ సూటిగా చిత్రీకరింపబడలేదు. ఇది ఆరు మాటలకంటే ఎక్కువలేని సంక్షిప్త వాక్యంతో సంగ్రహింపబడినది. ఆ తరువాత ఉత్పన్నమయే ప్రశ్న- నిజంగా ప్రఫుల్లలో అనాసక్తత వున్నదా? అన్నది. ఒకసారి ప్రకృతి ఆమెను స్పృశిస్తుంది; ప్రపంచాన్నంతటినీ ఆమె పరాయిగా చేస్తుంది. పూర్తిగా వ్యక్తిగతమయిన ఆమె సతత్వగుణం అన్నిటినీ అధిగమించి, తనూజ్జిత్వాన్ని కూడ నిరర్థకంగా, శూన్యంగా చేస్తుంది. ఆమె సాంస్కృతిక మత పద్ధతిలో సతత్వ ధర్మ నిర్వహణ చేస్తూ భర్త యింటిలో నివసించిన దనవచ్చును. అయితే ఈ విషయం కూడ, చివరి అధ్యాయంలో తొందరపాటులో చెప్పిన దానికంటే మన కెక్కువ తెలియదు. ఈ దృక్కోణంతో నవల ముగింపు జరుగుతుంది; కాని అది అక్కడే నిజంగా మొదలుపెట్టబడవలసి వున్నది. నవలకు చక్కటి ప్రారంభం, ఆటంకములతో నిండిన మధ్య వున్నది కాని, ముగింపు లేదు అని మరో విధంగా చెప్పకొన వచ్చును. ప్రఫుల్ల తన గృహస్థ ధర్మాన్ని సామర్థ్యంతో నిర్వహించినదనీ, తను చుట్టూ వుండే వారిని సంతోష పెట్టినదనీ మాత్రమే మనకు తెలుసు. ఆమె మామగారి వ్యతిరేకత అప్పటికే తొలగి పోయినదని మనం తెలుసుకున్నపుడు, ఆమె చేసిన యీ పనికి ప్రాధాన్యము కలిగినదిగా కనుపించదు. ఇది ప్రధానాంశమునుండి ఒక్కసారిగా అప్రధానాంశమునకు దారి తీసినట్లుగా కనిపిస్తుంది. అంత భయంకరమైన చౌధరాణి 'ఆకాశంబున నుండి, శంభుని శిరంబందుండి, పవనాంధో లోకముం జేరె' అన్నట్లు గృహస్థ జీవితమన్న అల్ప ధర్మంతో సుఖపడటం నేర్చుకొన్నది.

మనం చివరి నవల 'సీతారామ్'కు వచ్చేటప్పటికి కళాత్మకమైన సృజనా ప్రజ్ఞలో యింకా పతనం గోచరిస్తుంది. దీనిలో నీతి— ఆధ్యాత్మిక పవిత్రత, గీతలో చెప్పిన అనాసక్తి క్రియా శీలత. దీనిపై చరిత్ర యొక్క సన్నని పొర అల్పాదింపబడినది. ప్రత్యేక సంఘటనల వర్ణనలు, ముఖ్యంగా తొలి అధ్యాయంలో శక్తివంతముగా చేయబడినవి. బంకిం చంద్రుడు చారిత్రక సత్యాలను కథనం చేయుటంతో స్వేచ్ఛా ప్రవృత్తి నవలంబించినప్పటికీ, ఈ నవలలో, పద్దెనిమిదవ శతాబ్దపు తొలి భాగంలో వంగదేశంలో ప్రభావితమయిన యుద్ధ పద్ధతులన్న, [illegible]

సాంఘిక జీవితాన్ని చరిత్రలో వున్నట్లే విశ్వసనీయంగా చిత్రించినాడని ప్రామాణిక చరిత్రకారుడైన జధునాథ సర్కార్ అభిప్రాయపడినాడు. అయితే మనం, మన దృష్టిపథంలోనుండి చారిత్రిక చట్రమును తొలగించివేస్తే కథ, పాత్రలు సంభవ ములుగా, తప్పని సరివిగా మనకు అగుపించవు.

ఆదర్శవాద దృష్టిలో ఈ కథ అరికట్టరాని వ్యామోహపాశాల్లో చిక్కు కున్న వ్యక్తి పతనం. ఆంటోనీవలె సీతారాం ఒక స్త్రీ కోసం తన సర్వస్వాన్నీ వదలుకొంటాడు. అయితే అతడు ప్రేమించిన పడతి—శ్రీ, క్లియోపాత్రా అంత మేధావియైన వేశ్య కాదు; ఈమె అతని భార్యే. భర్తను ఎంతో గాఢంగా ప్రేమించి నప్పటికీ, అతనినుండి విడివడిపోయిన జీవితం గడుపుతుంది. ఆమె వివాహిత స్త్రీ, అయినా ప్రపంచాన్ని జయించిన సన్యాసిని. ఈమె అతన్ని పగలూ రాత్రీ, రాత్రీ పగలూ తన సాన్నిధ్యంలో వుండనిస్తుంది. అతడు మాత్రం ఆమెను తాకనయినా తాకరాదు. ఇది ఒక అసంభవమైన పరిస్థితి. దీన్ని ఒక్క భగవదావిష్కరణతో మాత్రమే సంభవింపజేయవచ్చును. లేదా సున్నితమైన ఆమె వాంఛలను తత్సంబంధమైన మనోగతిని విపులంగా వర్ణించి సంభవనీయంగా చేయవచ్చును. కాని బంకిం చంద్రుడు మనస్తత్వ శాస్త్ర చర్చకాక, ఈ పిచ్చి వ్యామోహ ఫలితంగా సీతారాం రాజ్యమెట్లా అవస్థల పాలవుతుందో చిత్రించే అసహజ వర్ణనలనే కార ణంగా చూప యత్నించినాడు.

భర్తను వదలి, భార్యదగ్గరకొస్తే అక్కడి చిత్రణ కూడ మనకు సమ్మతంగా తోచదు. జ్యోతిష్యం సీతారాంని హెచ్చరిస్తుంది; అతడు తన భార్య - శ్రీని వదలి వేస్తాడు. పాపం ఆమె ఒంటరితనంలో కృంగి కృశించిపోతూ వుంటుంది. తనను వదలివేసిన భర్తయెడల తీరని, అస్పష్టమైన కోర్కెలతో, ఆలోచనలతో ఆమె హృదయం నిండి వున్నది. ఆమె ఈ తొలి జీవిత వర్ణన హృద్యంగా వున్నది, అప్పుడు ఒక విషమ పరిస్థితిలో ఆమె సీతారాంను కలుసుకోవడం జరుగుతుంది; వెంటనే జ్యోతిష్యపు ఆదేశాన్ని వింటుంది. ఈసారి తనే అతనినుండి పారి పోతుంది. జయంతి అనే సన్యాసినిని కలుసుకొని సన్యసిస్తుంది. తన భర్తయింటికి తిరిగి వచ్చేటప్పటికి ఆమె మారిపోయిన స్త్రీ; సీతారాముని భార్య స్థానాన్ని జయంతి శిష్యురాలు ఆక్రమించినది. భర్తతో నివసిస్తుంది కాని, భార్యగా కాదు. తానే మేల్కొలిపిన దుష్కర వాంఛల తీర్చడంలో విఫలం గావడంతో, అతని వినాశానికి దారి తీస్తుంది. ఆమె ప్రియమైన వారి నాశనానికి కారకురాలౌతుందన్న

జ్యోతిష్యాన్ని నూటికి నూరుపాళ్ళు నిజం చేస్తుందా? ఆమె సోదరుడు గంగారాం మృతికి ఆమెయే కారణం. ఆమె కోసమే సీతారాం నైతికంగా పతనమవుతాడు. అతని రాజ్యం నాశన మవుతుంది. ఆమెకు తన విద్యుక్త ధర్మంపట్ల పొరపాటు అభిప్రాయం వున్నట్లు మనకు కనిపిస్తుంది. అన్నిటికంటె ముందు బంకిం చంద్రుని అభిప్రాయాన్ని పరిశీలిస్తాము. ఆయన ఉద్దేశంలో మతాచరణకు ప్రాపంచిక జీవితం, సన్యాసముకంటె మంచి అవకాశం కలిగిస్తుంది. అసలయిన మతం చర్య ల్లోను, జ్ఞానంలోను, ధర్మంలోను సామరస్య పూర్ణమయిన మానవ వికాసానికి తోడ్పడుతుంది. ఒక ముఖ్యమైన రంగంనుండి – సాంఘిక ధర్మాన్నుండి తప్పు కోవటం వలన సన్యాసం కుంటిదయింది. బంకిం చంద్రుని వ్యాఖ్యలో రెండో అంగం. అసలు ధర్మమంటే ఏమిటి? ఆయన సమాధానం– మనం వున్న పరిస్థితు లలో మనం చేయవలసినది యే ధర్మం. ఇక్కడనే బంకిం చంద్రుని సాంప్ర దాయకత మనకు గోచరిస్తుంది. శ్రీ భార్య కాబట్టి, ఆమె అనుల్లంఘనీయమైన విద్యుక్తధర్మం, భర్త సాధారణమయిన కోర్కెలు తీర్చడం. సన్యాసపు ఆదర్శ ప్రభావంలో తనలో స్త్రీ సహజ ప్రవృత్తులు క్షీణించిపోయినవని తలచిన ఆమె, తాను వెంటనే నిర్వర్తించవలసిన విధులను వదలివేస్తుంది.

ఇదంతా సుందరమైన – కాకపోతే వికృతమైన – తాత్త్విక చర్చ. కళ ప్రయోజనం తాత్త్వికతను ప్రబోధించడం కాదు. దాని ప్రాథమిక ప్రయోజనం సజీవ ప్రతీకలను సృజించడం. నవల రెండో భాగంలోని శ్రీ, జీవించి వున్న స్త్రీ యేనా, లేక ఆకృతి పొందని భావనా? అనిపిస్తుంది. ఆమె ఈ నిష్ఠుర సన్యాసపు అంతరంగములో, స్త్రీ సహజమయిన వాంఛలు జాగృతం కావడం అపుడపుడు ఆమె అనుభవంలోకి వచ్చివుండ వచ్చును. ఆమె తన గురువైన జయంతితో, తనకు రాజుతో సహా పన్నెండుమంది శత్రువు లున్నారని, తాను సన్యాసినిగా కాక, భార్యగా తరచు భావిస్తుండటం జరుగుతున్నదని చెప్తుంది. అయితే ఇదంతా ఉత్కంఠపూర్ణమయిన ఆధ్యాత్మిక సంఘర్షణలో ఒక వెలుగురేఖ మాత్రమే. జయంతి సలహాతో శ్రీ పారిపోతుంది; ఒంటరి జీవితం గడపడంతో తన సమస్యను పరిష్కరించుకుంటుంది. ఆ విధంగా కళను ఆవేశాత్మక రచనను **(Melodrama)** బలిపెట్టడం జరుగుతుంది. ఈ పరిష్కారాన్ని, పరిష్కార ఫలితంగా ఏర్పడిన చిక్కులను 'రజని' నవలలోని లవంగలత, అమరనాధుల ఉపాఖ్యానంతో పోల్చ వచ్చును; శరచ్చంద్రుని ప్రసిద్ధికెక్కిన నవలలోని రాజ్యలక్ష్మి, శ్రీకాంతుల వాంఛలు, వాటి ఫలితం విషాదములతో పోల్చవచ్చును. చారిత్రిక నవల ప్రాస్తావి

కంగా మాత్రమే వ్యక్తుల భాగ్యరేఖలను గురించి చెప్తుంది. దాని అసలు ప్రయో జనం రాజ్యాల "ఉత్థానపతనాలను ఉల్లేఖించడమే. బంకిం చంద్రుని ఉద్దేశం ఆధ్యాత్మిక సంఘర్షణే అయినట్లయితే చారిత్రిక నవల అవసరాలను బంకించంద్రుడు నిర్లక్ష్యం చేసివుండాలిసిందని ఎవరైనా వాదించవచ్చును. అయితే అది నవలా ప్రక్రియను గూర్చిన పెద్ద ప్రశ్నలే మనముం దుంచుతుంది. గొప్ప గొప్ప విషయా లను చెప్పే చారిత్రక నవల, మనస్తత్వశాస్త్ర సూక్ష్మాల్లోనికి ప్రవేశించగలదా? 'సీతారాం' హృదయాలను కదిలించే సంఘటనలతో, వర్ణనలతో వ్రాయబడి నప్పటికి పాత్రల గాఢ సమస్యల అంచులు మాత్రమే తాకుతుందని చెప్పవలెను.

# 5

# సాహిత్య విమర్శ

నవలాకారునిగా బంకిం చంద్రుడు యెంత గొప్పవాడో, విమర్శకుడుగా అంత గొప్పవాడు. అయితే సృజనాత్మక కళాకారునిగానే ఆయన ఔన్నత్యం, భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనంలో ఆయన భాగస్వామ్యం, విమర్శనా ప్రక్రియకు ఆయన చేసిన కృషిని మరుగు పరచినవి. అప్పుడప్పుడు నీతి ప్రబోధం లోకి జారిపోయే సందర్భాలను వదలివేస్తే, ఆయన విమర్శ విశిష్టమైనది. కారణం ఆయన విమర్శ సునిశితమూ, సంక్షిప్తమై విశేషాత్మకంగా నిర్ణయాత్మకంగా చర్విత చర్వణం లేకుండా - ఒక్కమాటలో చెప్పవలెనంటే అనుభవాత్మకంగా వుంటుంది.

బంకిం చంద్రుడు మనస్తత్వంలోను, వైఖరిలోను ప్రధానంగా ఆధునికుడు. కొన్ని విషయాల్లో పునరుద్ధరణవాది యైనప్పటికీ, సాహిత్య విలువల పరిశీలనలో భారతీయ సంప్రదాయిక పద్ధతులను వీడ్కొలిప్తూ, తన సాహిత్య విమర్శను ప్రారం భించినాడు. సంస్కృత లక్షణ శాస్త్రాల్లో ఉపయోగించిన పారిభాషిక పద్ధాలు

ఆధునిక కాలంలో అర్థాన్ని కోల్పోయిన వన్నాడు; ప్రత్యేకంగా - అసంఖ్యాక మయిన మానవ ప్రవృత్తులను నవరసాలకు కుదించడానికి ఆయన అభ్యంతరం చెప్పినాడు. అందువలన మన పండితులకు ఒక నమస్కారంపెట్టి వారినీ వారి శబ్దాడంబారాలను వదలిపెట్టవలె నన్నాడు. రకరకాలుగా వ్యక్తమయ్యే మానవుని సహజ సౌందర్యారాధన బంకిం చంద్రుని విమర్శలో మొదటి అంశం. ఈ మానవుడు తనను రంగు, రూపం, కదలిక, ధ్వని, అర్థవంతమైన మాటలతో వ్యక్తీకరించుకొంటాడు. రంగును తన మాధ్యమంగా స్వీకరించిన కళాకారుడు చిత్రకారుడవుతాడు. రూప వ్యక్తీకరణ చేయవలెననే ఆకాంక్ష రెండు విధాలుగా బయల్పడుతుంది. వృక్ష, జంతు ప్రపంచానికి బాహ్యమయిన, విస్తార వస్తు సముదాయంతో కట్టడాలను నిర్మించవలెననే కోరిక వాస్తుశిల్ప మవుతుంది. వృక్షాల్లోను, చైతన్య వంతమైన జీవుల్లోను గల సౌందర్య స్వరూపాలకు ఆకృతి నీయవలెననే కోరిక శిల్పకళ అవుతుంది. నాట్యం కదలికలోని సౌందర్యాన్ని ఆవిష్కరిస్తుంది; ధ్వని సంగీతంలో కళాత్మకంగా వెలువడుతుంది. అర్థవంతమైన మాటలు కవిత్వం అధిరోహించే అరదాలు.

బుద్ధికి అందంగా గోచరించేదీ, ఆచరణ యోగ్యమయినదీ అయిన ఈ విశ్లేషణ అరిస్టాటిల్ 'లక్షణ కావ్యం' (Aristotle's Poetics) ను గుర్తుకు తెచ్చేదిగా వుంటుంది. బంకిం చంద్రుడు తన పద్ధతిలో వివిధములైన కవిత్వ ప్రక్రియలను (కవిత్వమంటే సృజనాత్మక సాహిత్యమనే విస్తృతమైన అర్థంలో గ్రహిస్తూ) నాటకం, ఇతిహాసం, గేయం మొదలయిన వాటిని వర్గీకరించడానికి ప్రయత్నం చేసినాడు. ఐతిహాసిక కావ్యానికి, నాటకానికి గల భేదాన్ని వివరించడంలో ఆయన అరిస్టాటిల్‌తో భేదించినాడు. రెండింటిలోను నటనా (చైతన్యవంతమయిన ఘటనా పరంపర), సంభాషణ వున్నవి. కాని నాటకంలో చెప్పదలచుకున్నదంతా సంభాషణద్వారా మాత్రమే జరుగుతుంది. అందువలన దానిలో కథపై, పాత్రల ఆధిక్యత వున్నది. కాని కథా కథన కావ్యంలో – అతి పెద్దదైన ఐతిహాసిక కావ్యమే కానీ, లేక చిన్న కథా కావ్యమే కానీ - ఘటనా పరంపరకే ప్రాథమికంగా ప్రాముఖ్యం వుంటుంది. అందువల్లనే కథ, పాత్రను ఆచ్ఛాదితం చేస్తుంది. ఆయన గేయ కావ్యానికి (lyric) యిచ్చిన నిర్వచనం గొప్ప మౌలికమయిన ఆలోచన. మానవుని మనస్సులో మార్మికమయిన అగాధా లున్నవి. బాహ్య నటన (చైతన్యవంతమయిన ఘటనాపరంపర) వలనగానీ (—అనగా ఐతి

హాసికములు లేక యితర కథాకథన కళాత్మక (ప్రక్రియలవలనగానీ——) లేక సంభాషణ వల్లగానీ (నాటకానికి యిదే సరియైన పరికరం) సాహిత్యంలో వ్యక్తీక రింపబడని భావాలు (ఆవేశాలు, ఉద్రేకాలు) వున్నవి. అటువంటి భావాల, క్షణిక మైన వెలుగు కణాలను ఏకపాత్రా సంభాషణ **(monologue)** లేక స్వగతంవల్ల మాత్రమే వ్యక్తీకరింప సాధ్యమవుతుంది. దాని కిప్పుడు సితారువంటి తంత్రీవాద్య **(lyre)** సమ్మేళన లేకపోయినా- అసలు పాడవలసిన అవసరమే లేకపోయినా గేయ కావ్యపు ప్రత్యేకతను గుర్తింపజేసే లక్షణమది. గేయ కావ్యం ఆత్మల లోతుల్లోనికి పోయి పరిశీలించగలదు. ఇతర సాహిత్య ప్రక్రియలకు అది సంభవం కాదు. అందువల్లనే అది ఐతిహాసిక కావ్యంకంటే (లేక నవల కంటే) నాటకం కంటే చిన్న దైనా ఉద్వేగ భరితమైనది. మనం ఐతిహాసిక గంభీరత అనీ, నాటకీయ క్లిష్టత లేక తారతమ్యమనీ అంటాము; అయితే గేయ కావ్యపు ఉద్వేగాన్ని గురించి మాట్లాడుతాము. బంకిం చంద్రుడు ఇంకొక మాటకూడ సూచన ప్రాయంగా చెప్పి నాడు. తన సమకాలిక కవుల కవిత్వమువలె, గేయ కావ్యం తన పరిధిని పెంచు కొన్నప్పుడు, సేమిత పరిధికల వైష్ణవ కవుల రచనలవలె లేక విద్యాపతి, చండీదాస్ గీతాలవలె అది ఉద్వేగపు చివరి అంచును స్పృశించదు. ఇది సూచనయే అయి నప్పటికిని ఆలోచింపదగిన విషయం. టి. యస్. ఇలియట్ డాన్ **(Donne)** నుండి తన కాలం వరకు గల ఆధునిక కవుల కవిత్వంలో, రకరకాల ఆధారాల నుండి సంగ్రహించిన విషయ సంచయాన్ని గూర్చి మాట్లాడేప్పుడు, అటువంటి కవిత్వం జనులను మెప్పించడమన్నది, పొసగని విషయాల విలీనతలోని ఉద్వేగం మీద ఆధారపడి వుంటుందని చెప్పడం గమనించతగిన విషయం. బంకిం చంద్రుడు సూచన ప్రాయంగా చెప్పిన విషయం టి. యస్. ఇలియట్ తనకు తెలియ కుండానే సాధింప యత్నించినాడు.

బంకిం చంద్రుని విమర్శలోని గొప్ప లక్షణం అతని పరిశీలనాత్మకమయిన బుద్ధి. ఆయన గేయ కావ్యాలమీద, జయదేవ విద్యాపతులమీద వ్రాసిన వ్యాసములు పునర్ముద్రణం చేసేటప్పుడు, అవి రవీంద్రనాథ టాగూరు ప్రముఖ రచనలు, ముఖ్యంగా గేయ కావ్యాలు వెలువడక ముందు వ్రాసినట్లు అధస్సూచిలో పేర్కొని నాడు. అందువల్ల టాగూరు కవిత కనుక ఆయన ముందున్నట్లయితే మధ్యకాలపు, ఆధునిక కాలపు గేయ కావ్యాలలో తాను గుర్తించిన విశిష్టతను వదలివేయక పోయినా మార్చేవాడని మన కనిపిస్తుంది. సాహిత్య వర్గీకరణకు లేక సాహిత్య ప్రక్రియల తాపకల్పనకు అంతం లేదని క్రోస్‌వలె బంకిం చంద్రుడు భావించి

నాడు. సంభాషణలతో వ్రాయబడిన మిల్టన్ 'కోమస్', గేదే 'ఫాస్ట్', బైరన్ 'మాన్‌ఫ్రెడ్' నాటికలుగా కంటే గేయ కావ్యములుగా మనము గుర్తించవలసి వుంటుదన్నాడు. స్కాట్ 'లామర్ మూర్ వధువు' (Scott's 'The Bride of Lamer moor') నవలగా కంటె నాకటం వలె ఉండదా ? అని ప్రశ్నించినాడు.

ఆదర్శ, వాస్తవికతా వాదాల మధ్య, శ్రేయస్సౌ సౌందర్యాల మధ్యగల తాత్త్విక భేదాలు కళాత్మక రచనకు అనుసంధించినప్పుడు అవి సాపేక్షికములుగా వుంటవి. విలేఖరీ, వ్యంగ్యాత్మక కవీ అయిన ఈశ్వరచంద్ర గుప్తవంటి రచయితలు తమ క్షుద్ర అనుభవాలను దూరం నుండి చూచిన విషయాల్లో గోచరించిన సంగతులను వ్యక్తీకరించినారు. తమ పూర్వాలోకపు సేమిత పరిధిని దాటి విహరించని ఈ వాస్తవికతా వాదులను గొప్ప కవులుగా పరిగణించరాదు. బంకిం చంద్రుడు, నాటక కారుడైన దీనబంధు మిత్రాను గురించి వ్రాసేటప్పుడు ఆయన సృజనాత్మక శక్తిని మూడు భాగాలుగా - అనుభవం లేక పర్యాలోకనం, సానుభూతి, సృజనాత్మకమైన భావనగా విశ్లేషణ చేసినాడు. గొప్ప రచయితలలో ఈ మూడు అంశాలు విలీనముయి సమైక్యం కాగలవనీ అంటాడు కవిత్వం - ఉన్న పరిస్థితిని గాక ఎట్లా వుండవలెనో అనే పరిస్థితి అనుకరిస్తుందని అరిస్టాటిల్ అన్నపుడు, ఆయన యిటువంటి ఏదో విలీనతనే బహుశః ఉద్దేశించి వుండవచ్చును.

కవి మేధస్సు మౌలికమయినదయి వుంటుంది; ఇతని ఈ మౌలికతే, ఇతనిని యితరులనుండి వేరు చేస్తుంది; ఇతనిని సృజనాత్మక రచయితగా చేస్తుంది. గాలిలో నుండి చెట్టు మొలవదని బెర్నార్డ్‌షా అన్నట్లు, శూన్యంలోనుండి అతనేమీ సృజించలేడు. అందువలన అతనికి గాఢ పర్యాలోకనం చాల అవసరం. అతని పర్యాలోకనారంగం ఎంత విస్తృతమయితే, అంత గొప్పగా అతని సృష్టి వుంటుంది. సృజనాత్మక కళాకారుడు తను అనుభవాలనుండి విషయ సేకరణ చేయడం వలన, సాహిత్యం జీవితంతో అవినాభావ సంబంధం కలిగి వుంటుంది - ఇంకో మాటలో సాహిత్యం జీవిత దర్పణం. బంకించంద్రుని అభిప్రాయంలో మొదటి 'మహాభారత' కృష్ణునీ, తరువాతి 'భాగవత' కృష్ణునికి గల వ్యత్యాసాలను ఇంతకు క్రితం పేర్కొనడం జరిగినది. బంకించంద్రుడు అన్నట్లు సాహిత్యంలో యీ భేదం వాల్మీకి చిత్రించిన శ్రీరామునీ, ఆ తరువాత శతాబ్దాల అనంతరం భవభూతి తన 'ఉత్తర రామచరిత'లో చిత్రించిన శ్రీరామచంద్రునీ పరిశీలించినట్లయితే బాగా స్పష్టమవుతుంది. కవి అన్ని కాలాలకు చెందినవాడైనప్పటికీ, తాను బ్రతికిన

కాలానికి సంబంధించినవాడు; అందువలన యిద్దరు శ్రీరామచంద్రులు ఆయా కాలాన్ని ప్రతిబింబించే రూపాలు - బంకిం చంద్రుడు భవభూతి నాయకునికి న్యాయం చేకూర్చలేదన్న విషయం అంగీకరించవలసి వుంటుంది. కాని ఆయన వాదనలోని ప్రాథమిక అంశం సరియైనదే. తన పరిసరాలతో సేమితమయిన అనుభవాలనుండి ప్రతి కళాకారుడూ, తన కళావస్తువును గ్రహిస్తాడు; అతడు ఈ అనుభవాలను రూపాంతరీకణం చేసినా, ఇవే అతని కళయొక్క పరిధినీ. పాక్షికంగా గుణ శ్రేష్ఠతను నిర్ణయిస్తవి.

అయితే కేవలం పర్యాలోకనం మానవుని, తాను చూసిన విషయాలను తు. చ. తప్పకుండా వర్ణించగలిగేటట్లు మాత్రం చేస్తుంది. కళాకారుడు కావడానికి అతనికి మరోశక్తి కూడ వుండాలె - దానికే బంకించంద్రుడు సానుభూతి (Sympathy) అన్నాడు. కాని ఆధునిక మనస్తత్వ శాస్త్రజ్ఞులు దానిని 'తదను భూతి' (empathy) అనే పారిభాషిక పదంతో పిలుస్తారు. కవి, తను చూచిన విషయాలపట్ల గాఢ అనుభూతి పొందాలె; అతడు తన కవితా వస్తువు లోతులకు పోయి పరిశీలించవలసి వుంటుంది. అతడది చేయలేకపోయినట్లయితే, అతని నాయకులు విగ్రహాలవలె, అతని దుష్టపాత్రలు (Vellains` రాక్షసులవలె వుంటారు. షేక్స్పియరుకు అనుభవాల, పర్యాలోకనాల లోతులకు పోయి పరిశీ లించదగిన శక్తి వుండడం వల్లనే, అతని దయ్యాలు, రాక్షసులూ - అతని ఏరియల్‌లూ, కాలిబన్‌లూ - కూడా మానవ వ్యక్తిత్వాన్ని పొందివుంటవి. ఈ శక్తియే ఒక గొప్ప రచయితను వాస్తవిక వాదిగానే కాక, ఆదర్శవాదిగా కూడ చేస్తుంది. 'నీలదర్పణం' రచయిత అయిన నాటక కారుడు దీనబంధు మిత్రానుండి. అతని గురువూ కేవల వ్యంగ్యాత్మక రచయిత అయిన ఈశ్వరచంద్ర గుప్తను వేరు చేసే గుణం యిదే.

కేవల సానుభూతి భావ శలలితమయిన విషయంగా పరిణమిస్తుంది. భార తీయ కథలలోనుండి ఉదాహరించదలిస్తే - వాల్మీకికి భర్తృమరణానికి విలపించే క్రౌంచపక్షిపట్ల సానుభూతి మాత్రమే ఉన్నట్లయితే ఊరక విలపించేవాడు; అటు వంటి సాధారణంగా జరిగిపోయే సంఘటనకు అమృతత్వాన్ని కల్పించి, అమృత కవిత్వంగా మలచగలిగేవాడు కాదు. కవి కావడానికి మానవునికి భావన కావాలె. భావనకు ప్రధాన లక్షణం అనాసక్తత. ఒక సామాన్య మానవుడు కరుణార్ద్ర హృదయుడైనపుడు స్వతంత్రంగా యేమీ సృజించలేడు కాని కవి అట్లాగాదు. కవి

పర్యాలోకనాలకూ, అనుభవాలకూ, ఆదర్శాలకూ, అనుభూతులకు ప్రాదేశికతను, పేరును కల్పించేది అతని భావన మాత్రమే; ఆవిధంగా ప్రత్యేకమయిన, వ్యక్తిగత మయిన విషయానికి, విశ్వజనీనత కల్పించబడుతుంది. అందువలననే వాల్మీకి మొదటి శ్లోకం చెప్పిన తరువాత, దూరంనుండి దానిని గురించి ఆలోచిస్తాడు. 'నా సానుభూతి వలన నాకు కలిగిన ఈ పరాకాష్టత ఏమిటి? నిజమైన కవి తన భావనను సానుభూతికి లోనయి వర్తించేటట్లు చేసుకుంటాడని బంకించంద్రుడు భావించడం సత్యమైనది.

బంకించంద్రుడు తన సాహిత్య విమర్శను, సిద్ధాంతకారులపట్ల హేళనా దృష్టితో ప్రారంభించినా ఆయనే తన సిద్ధాంత సముచ్చయాన్ని వెలువరించినాడు. అవి విమర్శనకు సహాయకరములుగా, ప్రోత్సాహ జనకములుగా వుండినవి; ఆవిధంగా స్థూలదృష్టి, అనుభవంతో ఆకృతిపొందిన కళాత్మక రచనపై దృష్టి వుంచిన విమర్శకుడు కూడ, విశ్వజనీనాను వర్తితములయిన అమూర్త సర్వ సాధారణీకరణముల సహాయం లేక ఏమీ చేయలేడు అని మనకు చూపించినాడు. అనేక కృతులను పాత్రలను, కవులను పోల్చటంతో — శకుంతలను డెస్డిమోనా, మిరండాలతోను, షేక్స్పియరును భవభూతితోను పోల్చడంతో — మన ఆలోచనా దృష్టిని విస్తృత పరిచినాడు బంకించంద్రుడు. జయదేవ, వర్డ్స్ వర్తులను పోల్చి విశిష్టతలను, ప్రత్యేకతలను చూపుటలో తులనాత్మక సాహిత్యాధ్యయనమని మన మిప్పుడు పిలచే తులనాత్మక విమర్శకు పునాదులు వేసినాడు. అతడు పరిశీల నాత్మక బుద్ధితో ప్రతిపాదించిన సిద్ధాంతములు అరిస్టాటిల్ వరకూ వెనకకూ వెళ్ళును; బెన్‌డెట్టోక్రోస్ వరకూ ముందుకు సాగును. బహుశః ఉపరిశోధనా సిద్ధాంతపు తాత్త్వికతతో (Positivish Philosophy) ప్రభావితుడయి కాబోలు, యింతకుముందే చెప్పినట్లుగా సాహిత్యాన్ని సాంఘిక, ఆర్థికశక్తుల సంఘర్షణ ఫలితంగా ఉద్భూద్ధమయినదిగా, కాల స్వభావమునకు వాగ్రూపమైన సమాధానముగా భావించిన ఆధునిక సామ్యవాద విమర్శకు ఆద్యుడయినాడు.

బంకించంద్రుని ఆచరణాత్మక విమర్శ ఒక్కొకక్క పర్యాయం సుదీర్ఘంగా, విశ్లేషాత్మకంగా, మరో పర్యాయం సంక్షిప్తంగా, సంగ్రహంగా వుంటుంది. కాని మంచి అభిరుచిగల విమర్శకుని అభిప్రాయ ప్రకటనలనుండి మనం ఆశించే విధంగా తీవిగా, సూటిగా, న్యాయసమ్మతంగా వుంటుంది. ఆయన పక్షపాతమును వహించినప్పుడు కూడ సునిశితమైన-దృక్పథాన్ని ప్రదర్శించినాడు. ప్రఖ్యాత కవి

జయదేవుని విమర్శిస్తూ, ఆ పాత మధురగీతాలను రచించిన శృంగార గేయ కారునికీ, నిజమైన సృజనాత్మక కళాకారుడైన విద్యాపతికి మధ్యగల భేదాన్ని వివరించినాడు. బంకించంద్రుడు జయదేవుని ఇంద్రియ లోలత్వం నుండి అతనికి బాహ్య పకృతిపట్లగల విపరీత ప్రేమను చర్చిస్తూ, అతనికి సరిగ్గా విరుద్ధ ప్రకృతియై, అంతర్దృష్టి కలిగిన వర్డ్సువర్తుతో పోల్చి తారతమ్యాన్ని వెలార్చినాడు. 'ది ఎడ్యుకేషన్ ఆఫ్ నేబర్', 'రూత్'లలో ఏవిధంగా ప్రకృతి, మానవ వైయ క్తిక స్వభావంతో మారుతుందో చూపిన గొప్ప ప్రకృతి కవి వర్డ్సువర్తుపట్ల అటువంటి తీర్పు పాక్షికంగా అన్యాయం. ప్రకృతి మధ్య పెరగడంవల్ల అణచబడిన కామ ప్రవృత్తి గల కపాలకుండలను సృజించిన బంకించంద్రుని నుండి, సంక్షుభితమైన తన మనస్సును, నిశీథ తపస్సును, ఏకాంత సరస్సులోని శీతల జలాల చూస్తూ సేద తీర్చుకొన్న మనోరమను సృజించిన బంకించంద్రునినుండి యీ తీర్పు వెలువడటం కొంత అసంబద్ధంగా వుంటుంది అయితే ఈ తీర్పులో. మొదటగా చూసినప్పుడు ఇంద్రియలోలత కన్పించినా, వర్డ్సువర్తు కవిత్వంలోని ఆధ్యాత్మిక నిర్ణాయక సూత్రం నొక్కి చెప్పడంవల్ల ఈ తీర్పు ప్రాముఖ్యం కలిగి వున్నది.

ఇంతకు ముందే చెప్పినట్లు, విమర్శకుడుగా బంకించంద్రుడు సిద్ధాంత ప్రతిపాదిగా కంటే, ఆచరణాత్మక, అనుభవాత్మక రసగ్రహణ పారీణునిగా, సౌందర్యారాధకునిగా కనిపిస్తాడు. కవిత్వ నిర్వచనమనే లక్షణ గ్రంథాల ప్రాథమిక సమస్య ఆయనకు ఎదురు కాదు. అరిస్టాటిల్, క్రోస్‌లతో సంబంధం వున్నప్పటికి ఆయన ఆలోచనలు గతాను గతికంగా చేసిన సూచనలు మాత్రమే; అటువంటి సూచనలు ఏవిధంగా తీవ్రమయినా ప్రాథమిక ఆక్షేపణలకు గురి అయ్యే లక్షణం కలిగివుంటవో, అట్లాగే ఈయన సూచనలు కూడ ఆక్షేపణలను ఆహ్వానించేటట్లు వుంటవి. ఆయన అర్థస్ఫోరకమయిన, ఉజ్జ్వల వ్యాఖ్యలు కొన్ని ఎక్కువకాలం నిలువని పుస్తక సమీక్షలుగా వెలువడినవి. ఉదాహరణగా అటువంటి ఒక సమీక్షచేసే సందర్భములో సుఖాంత రచనల ప్రవృత్తిని వెలువరిస్తూ 'తప్పు' (error) కంటే 'పొరపాటే' (mistake) హాస్య ప్రయోజన మంటాడు. ఇట్లా వెలువరించిన సుఖాంత కావ్య విమర్శకూ. అరిష్టాటిల్ లక్షణ గ్రంథానికి చాల దూరం. అయితే ఒక విషయం గమనించతగినది. అరిష్టాటిల్ 'తప్పటడుగు' (hamartia) లేక నిర్ణయం తీసుకోవటంలో చేసిన 'తప్పు'ను (error of judgement) విషాదాంత కావ్యాల లక్షణంగా పేర్కొనినాడు కాని, సుఖాంత కావ్యాల నుద్దేశించి కాదు.

ఆశించిన విధంగానే, తన సృజనాత్మక రచనలపై గాఢ ప్రభావం కలిగించిన షేక్స్పియరు కవిశేఖరుని గూర్చి బంకించంద్రుని వ్యాఖ్య అత్యుత్తమంగా వుంటుంది. భవభూతి 'ఉత్తర రామ చరిత' నాటకం విశ్లేషణచేసే సందర్భములో ఆయన ఉజ్జ్వల ఆనుషంగిక వ్యాఖ్య వెలువడుతుంది. తన పాతివ్రత్య నిరూపణకై రెండవసారి అగ్నిపరీక్షకు తిరస్కరించిన సీత, భవభూతి ఒడిలో తల దాచుకొంటుంది. దుఃఖితుడైన రాముడు ఒంటరిగా జీవిస్తుంటాడు. వైదిక నియమాలకు వ్యతిరేకంగా ఒక శూద్రుడు బ్రాహ్మణోచితమైన తపస్సు చేస్తున్నాడని, ఆ కారణంగా ఆయన రాజ్య ప్రజలు సంక్రామిక రోగ పీడితులయి వున్నారని తెలుసుకొన్న శ్రీరామచంద్రుడు, తానంతకుముందు సీతతో ఆనందంగా గడపిన పంచవటికి, శాసన ధిక్కారమునుచేసిన ఆ వ్యక్తిని వెదుకుతూ వస్తాడు. మూల కథను మార్చుతూ భవభూతి అదృశ్యరూపంలో సీత, రాముని దర్శించడానికి ఈ అరణ్య ప్రాంతానికి వచ్చేటట్లు చేస్తాడు. రాముని రాకలో గల ఆంతర్యాన్ని తెలుసుకున్న భవభూతి సీత—"అదృష్టవశాత్తూ ఈ రాజు (ప్రసంగవశాత్తూ తన ప్రజలను సంతోషపెట్టటానికి ఆమెను బహిష్కరించిన ఈ రాజు) యింకా తన రాజ్య కార్య నిర్వహణలో పట్టుదల సడలించలేదు. "అంటుంది. ఈ సంక్షిప్త వ్యాఖ్య ప్రస్తావిస్తూ బంకించంద్రుడు—" సాహిత్య ఔన్నత్యములో ఈ ఉపాఖ్యానాన్ని ఏ భాషలోని, ఏ నాటకంలో నయినా వున్న అందమైన విషయాలన్నిటితో పోల్చవచ్చును....అటువంటి వాక్యాలు షేక్స్పియరు నాటకాల్లో కనిపిస్తవి." అంటాడు. ఈ వ్యాఖ్యలో షేక్స్పియరు కావ్యాలను సరిగ్గా అర్థం చేసుకోవడం కనిపిస్తుంది. ఈ వ్యాఖ్య భవభూతి నాటకీయ మేధస్సుకు జోహార్లర్పించడ మవుతుంది; బంకించంద్రుని విమర్శలో గల లోతును, వాడిని వెలువరిస్తుంది.

# 6

## కలగూరగంప

మన నవలాకారుల్లో బంకించంద్రుడు మొదటివాడు. తరువాత గొప్ప నవలాకారులు రవీంద్రనాథ టాగూరు, శరచ్చంద్ర ఛటర్జీ, సాహిత్యరంగంలో ప్రవేశించినప్పటికి ఆయనను యింకా అత్యుత్తమ నవలాకారునిగా చాలమంది విమర్శకులు భావిస్తారు. అయితే ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. వచన రచనలే కాక అనేక సాహిత్య ప్రక్రియలను తన మంత్రదండంతో తాకి అద్భుత సృష్టిచేసిన మాంత్రికుడు ఆయన. ఆయన తొలి సాహిత్య వ్యాసంగమును గూర్చి ఉపోద్ఘాతములో పేర్కొనడం జరిగినది. వాటిని విశదంగా చర్చించవలసిన అనసరంలేదు. కథాత్మకం కాని ఆయన తరువాతి వచన రచనా వ్యాసంగం అసాధారణ ప్రజ్ఞతో విలసిల్లుతూ వుంటుంది. ఆయనకు యిష్టమయిన 'కమలా కాంతేర్ దస్తార్' సృజనాత్మక మౌలికతతో కళాత్మక ప్రావీణ్యంతో అత్యుత్తమ నవలలతో సరితూగుతుంది. ఆయన 1872 లో ప్రారంభించిన 'వంగదర్శక' పత్రికలో, ఆయన తరువాతి రచనలలో చాల భాగం వెలువడినవి. దాని కాయన నాలుగేండ్లు సంపాదకుడుగా వున్నాడు. 1877 లో ఆయన సోదరుడు దీనిని పునరుద్ధరించినపుడూ ఆయనే దీనికి వెన్నెముకగా వున్నాడు. 1872 తరువాత ఆయన రచనలన్నీ వంగ పత్రికా రచన కాక ఆదర్శాన్ని చూపెట్టిన 'వంగ దర్శక'లోను, తరువాత 'ప్రచార్', 'నవజీవన్' పత్రికలలో వెలువడినవి. ఆయనతో అవినాభావం సంబంధం కలిగిన 'వంగ దర్శక'లో వైవిధ్యం కల రచనలు- ఆలోచనాత్మకములు, హాస్యాయుతములు అయిన నవలలు, కథలు, వ్యాసాలు, గ్రంథ సమీక్షలు ప్రచురింపబడేవి. బంకించంద్రుడు తన రచనలు ప్రచురించడమేగాక మంచి రచనకు, ప్రవర్తనకు ఒక స్థాయిని నిర్ణయించ ప్రయత్నించినా డన్నది గుర్తుంచుకోవల్సిన విషయంకే కొంతకాలం ఒక అకాడమీ అంత అధికారంగా చలాయించిన వాడీయన. ఆయన పత్రికల్లో ప్రచురించిన వ్యాసాలు నోటి దురుసుతనంలోను, వ్యంగ్యంలోను నిండి వున్నవి, వాటిని ఎక్కువకాలం విలువని పత్రికా రచనగా ఉద్దేశించినప్పటికీ

అవి కాలమనే పరీక్షలో నెగ్గినవి. కాలాన్నధిగమించిన పత్రికా రచనే సాహిత్య మవుతుంది.

బంకించంద్రుని నవలల్లో ఎప్పుడో వాని హాస్యాని కవకాశం కలుగదు. వాటిలో చాల సుఖాంతా లున్నప్పటికీ 'ఇందిర' మాత్రమే హాస్యరస ప్రధానంగా వుంటుంది. కలగూరగంపయిన వ్యాసాల్లో (తరువాత అవి లోక రహస్య అన్న పేరుతో ప్రచురింపబడినవి.) బంకించంద్రుని హాస్యప్రజ్ఞ అవిరళ గంగా ప్రవాహంలా సాగిపోతుంది. ఆయన హాస్యం సునిశిత వ్యంగ్యంగా వ్యక్తమవుతుంది. సాహితీపరమయిన వ్యక్తిగత విశిష్టతకు ప్రాకులాడే పెద్దలు వీటిని చమత్కార రచనకు ఉదాహరణగా పేర్కొనవచ్చును. కారణం అవి సానుభూతికంటె, ఆధిక్య భావనలో ప్రభవించడమూ, శాబ్దికమయిన ఆడంబరత్వం కలిగివుండటమే. అయితే యిట్లా చెప్పడం వాటి యోగ్యతను పూర్తిగా పరిహరించడం కాదు. ఈ శబ్దాడంబరము కలిగిన ఇంద్రజాలం సృజనాత్మక ప్రజ్ఞతోను, భావనతోను, నీతి స్ఫోరకమయిన కథలతోను వెలిగిపోతూ వుంటుంది. తన కొన్ని వ్యాసాల్లో, ఉదాహరణగా, ఆయన, మానవతవైపు పెద్ద పులి అజ్ఞానంతో చూసే విధంగా, అనాసక్త వైఖరితో చూస్తాడు. ఇంకొక వ్యాసంలో ఆధునిక బెంగాలీ "బాబు"ను గురించిన దివ్య భవిష్యద్వాణి 'మహాభారతం'లో జరిగినట్లు ఊహిస్తాడు; ఈ దుర్బలుడైన "బాబు" భగవదవతారంగా వర్ణింపబడతాడు. మళ్ళీ అతని వ్యంగ్య చమత్కారం భారతీయ సమాజం, సాహిత్యం పట్ల ఆంగ్లేయుల గర్వపూరితమైన అజ్ఞానాన్ని అద్భుతంగా యెగతాళి చేస్తుంది. ఈ రేఖాచిత్రము లన్నిటిలోను భావనా విహంగం మహనీయత నాపాదిస్తుంది. ఈ కల్పన రాబిలే వ్యంగ్యం వలె కాక స్విఫ్ట్ వ్యంగ్యాన్ని గుర్తుకు తెచ్చేదిగా వుంటుంది.

కొంత హాస్యంతోను, కొంత గంభీరంగాను తన గొప్ప రచనగా పేర్కొన్న పద్య వ్యంగ్య వ్యాస సంకలనం 'కమలా కాంతేర్ దప్తార్'లో బంకించంద్రుని మేధో సూత్రాలన్నీ ఏకంగా పెనవేయబడినవి. ఇక్కడ మనకు భావనలో ప్రభవించిన భ్రమ, వ్యంగ్యం, పాండిత్యం, చమత్కారం- అన్నీ తీవ్రమయిన ఆదర్శ వాదంతో ఉజ్జీవింపజేయబడినవి. 'కమలా కాంతేర్ దప్తార్' పుట్టుపూర్వోత్తరాల గురించి విమర్శకులు తలలు బద్దలు కొట్టుకున్నారు. కమలాకాంతుడు నల్లమందు భాయి; వ్యాసాలు వ్యక్తిగత అభిప్రాయ ప్రకటనలు. డికిన్సీ వ్రాసిన 'ఒక నల్లమందు భాయి పశ్చాత్తాప ప్రకటనలు (De Quincey's Confessions of

an Opium Eather) నుండి బంకిం చంద్రుడు తన కమలాకాంతుని సృజించినాడా అని కొంతమంది ఊహించినారు. లేక కొందరనుకొన్నట్లు 'పిక్‌విక్ పేపర్సు'లోని మేజస్ట్రేటుకోర్టు దృశ్యంనుండి గ్రహించినాడా? ఈ రెండింటిలోను పోలిక చాల కొద్ది కావున ఈ సాహితీ వారసత్వపు సూచనలన్నీ వదలివేసి, కమలాకాంతుని మౌలిక సృష్టిగా పరిగణించడం మంచిది. కల్పన, వాస్తవికత, గేయ కావ్యపు భావన. ఘాటైన వ్యంగ్యం, ఉదాత్తమైన అనాసక్త గుణం, తీవ్రమయిన కోరికల- సమ్యక్ మిశ్రమం సాహిత్యంలో మన కింకెక్కడా కన్పించదు. కమలాకాంతుని బీదతనం, పాండిత్యం, అతని నల్లమందు అలవాటు, పాలంటే యిష్టం - అతన్ని గొప్ప స్పృహణీయ పాత్రగా, సజీవ మానవునిగా చిత్రిస్తవి.

సమాజ పరంగా బంకించంద్రునికన్న ఆలోచనలు, తాత్త్వికతను గూర్చి చెప్పటం జరిగినది. స్థలాభావం వలన విపుల పరిశీలన కవకాశంలేదు. ఆయన వైజ్ఞానిక వ్యాసాలు గమనించ తగినవి. వాని ద్వారా విజ్ఞానమును (Science) ఏ విధముగా ప్రజల అభిరుచికి తగిన ప్రక్రియగా రూపొందించవచ్చునో ఆయన చూపించినాడు. కాని సాహిత్యంగా అవి చాలాకాలం నిలువలేకపోయినవి. బహుశః వైజ్ఞానిక సత్యాలు, సాహితీ కళాత్మక సత్యాలంత పురాతనమయినవి కాక పోవడమే కారణం. విద్యా పాఠ్యగ్రంథ రంగముపై కూడ ఈయన జరిపిన ఒకటి, రెండు దండయాత్రలు విశ్లేషణకూ, విమర్శకూ అవకాశ మివ్వవు. ఆయన వ్రాసిన ఎన్నో విమర్శనాత్మక వ్యాఖ్యల గూర్చి - ముఖ్యంగా వానిలో ప్రతిబింబించిన ఆయన విమర్శనా వైఖరిని గూర్చి చివరి వ్యాఖ్య చేయవలసి వున్నది. బంకిం చంద్రుడు సాహిత్యంలో ఒకే ఆదర్శం తన ముందుంచుకొని నడవలేదు. ఆయన ఉద్దేశంలో సాహిత్యం రెండు ప్రయోజనాలను సాధించవలసి వుంటుంది. అవి సౌందర్య సృష్టి, ప్రజాశ్రేయస్సు. అయితే అందంగా లేనిది శ్రేయోదాయకం కాదా? అన్న ప్రశ్న మిగిలిపోతుంది. రెండు రకాల సాహిత్యంలోని భేదాన్ని ఆయన యిట్లా చెప్పినాడు. మొదటిది అంతర్నిహితమైన సహజ భావాలు, ఉన్నత ఆశయాలను వెలువరించే సాహిత్యం; రెండవది ఈశ్వర చంద్రగుప్త రచనలవలె ప్రపంచము, ప్రాపంచిక విషయాల పరిశీలించేదీ; వర్ణించేదీ, ప్రదర్శించేదీ ఆయన సాహిత్యం. కవులు జయదేవునివలె ఇంద్రియ లోలత్వాన్నీ, వర్డ్సువర్తువలె ఆధ్యాత్మికతను కలిగి వుండవచ్చును. అయితే ఈ రెండు తీవ్రదశలు (extremes) వర్జించడం మంచిది. సిద్ధాంతకారునిగా ఆయన ఈ రెండు భావాలను సంశ్లేషణ చేయడానికి యత్నించలేదు. కాని తన రచనలలో నీతి బోధకుడుగా, సౌందర్య

స్రష్టగా మనకు దర్శన మిస్తాడు. తన 'కృష్ణ కాంతుని వీలునామా'లో 'ఆనంద మఠం'లో 'మృణాళిని'లోని మనోరమలో ఈ రెండు ప్రయోజనాలను సమ్మేళన మొనరించి ఏకత్వాన్ని సాధించినట్లుగా కనిపిస్తుంది. 'కపాల మండల'లోని కళాత్మక సృష్టి సత్యం శ్రేయోగణమనే ద్వివిధ భావ పరిధుల కలితంగా వుంటుంది. 'విష వృక్షం', 'రజని'లలో గూడ మన కదే సత్యం గోచరిస్తుంది. అయితే ఈ రెండు ఎప్పుడోగాని వేరుగా వుండవు. 'రాజసింహ', 'దేవి చౌధరాణి', 'సీతా రాం'లలో ఆయన సృజనాత్మక భావనా శక్తికి, ఆయన ప్రచార కుతూహలం వలన గ్రహణం పట్టినట్లుగా కనిపిస్తుంది. 'కళ అంతా నీతి బాహ్యామైన దన్నాడు అస్కార్ వైల్డ్. అయితే సృజనాత్మకమైన కళ నీతి పూర్ణమైనదన్న విషయం కూడ అంతే సత్యం. ఎందువల్లనంటే – ఇది మానవుని ప్రవర్తనను రసాత్మకమయిన ఆకృతిలో మలచడమేగాక, మన సానుభూతి, సౌహార్ధాలకు వ్యాప్తిని కల్పిస్తుంది; మానసిక దృష్టిని విస్తరింపజేస్తుంది. ఈ దృష్టికోణంలో సౌందర్య సృష్టి చేసినపు డల్లా బంకిం చంద్రుడు యీ గొప్ప నీతిని కూడ ప్రబోధించినాడు; ఆయన తొలి శైవలిని, బహుశః తరువాతి శైవలిని కంటే నీతిదాయకంగా చిత్రింపబడినట్లు కని పిస్తుంది; సూర్యముఖి, ఆయేషాలు చెప్పిన దానికంటె గొప్పవయిన నీతి సూత్రా లను మనోరమ ప్రవచిస్తుంది. లవంగలత 'బలహీనత', ఎంతో మనోల్లాసం కలిగించేదిగా, ఆమె 'బలం' కంటే అది సామాజికంగా తక్కువ విలువ కలిగిందేమీ కానట్లుగా స్ఫురింపజేస్తుంది.

# 7

## అ ను బం ధ ము

## వందేమాతరం (1876 1976)

బంకించంద్రుడు సంస్కృత, వంగభాషల మిశ్రమంతో వ్రాసిన 'వందే మాతరం' భారతీయ సంస్కృతికి సంతరించిపెట్టిన నిరుపమాన సంపద. దేశభక్తి గీతాలు, జాతీయ గీతాలు ప్రాథమికంగా స్థానిక ప్రజల నుత్సాహపరిచే గుణం కలిగి వుండడం వల్ల, ఒక దేశపు జాతీయ గీతాన్ని మరో దేశపు గీతంతో పోల్చడం కష్టం. అటువంటి గీతాలన్నీ స్థానిక నైసర్గికతతో, చరిత్రతో, సంప్రదాయంతో ముడిపడి వున్నవి. 'వందేమాతరం' అంత గాఢంగా, విస్తృతంగా సంచలనం కలిగించిన జాతీయగీత మేదీ లేదు; ఇంతగా అసంఖ్యాక జనాన్ని స్పందింపజేసిన నినాదమూ మరొకటి లేదు. అని బహుశః చెప్పవచ్చును.

ఈ గేయం మొదట 'ఆనంద మఠం' నవలలో కన్పిస్తుంది. 'ఆనంద మఠం', 'వంగ దర్శక' పత్రికలో ధారావాహికముగా ప్రచురింపబడిన తరువాత, 1882 లో పుస్తకరూపంలో వెలువడినది. ఈ గేయం 'ఆనంద మఠం' కథలోని ఆత్మతో ఎంతో తాదాత్మ్యం పొంది వున్నది; పాత్రల పెదవులనుండి తనంతట తానే ఉబికి వస్తుంది; అయితే నవయుగ నిర్మాణానికి నాంది పలికే యీ నవల వ్రాయడానికి కొన్ని సంవత్సరాల పూర్వమే 1875—76 ల్లో వందేమాతరం ఒక ఆవేశభరితమైన క్షణంలో వ్రాయబడింది. అని తెలుసుకున్న పాఠకులు ఆశ్చర్య ముగ్ధులు కాక మానరు. నవల అందించే సందేశాన్ని ఈ గేయం సంగ్రహంగా తెలుపుతుంది. తొలి భారత రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ యింకో సందర్భములో చెప్పినట్లుగా బెంగాలులో తప్ప మిగతా అన్నిచోట్ల, అనేక వేదికలపై ఈ గేయాన్ని ఆలాపించిన వేలాది జనులకు, ఈ నినాదమును ఏక కంఠముతో ఎలుగెత్తి

అరచిన లక్షలాది, కోట్లాది జనులకు, ఈ గేయం ఏ కథలో ప్రస్తావించబడిందో తెలియదు.

1882 లో బంకించంద్రుడు 'ఆనంద మఠం' ప్రచురించిన సమయం రాజకీయోద్యమాలతో సంచలితమై వున్నది; ఐరోపీయుల, దేశీయుల మధ్య ఎటువంటి విచక్షణ చూపక న్యాయం కలిగించవలెననీ, ప్రభుత్వపాలనా వ్యవహారములలో దేశీయుల కెక్కువ భాగం కల్పించవలెననీ అలజడి ప్రారంభమయింది. భవిష్యద్భారత రూపకల్పనలో ప్రముఖపాత్ర వహించవల్సిన భారత జాతీయ కాంగ్రెసు 1885 లో స్థాపింపబడి, ప్రజల ఆకాంక్షలను వ్యక్తీకరించే ప్రతినిధి అయింది. 'ఒక పర్యావలోకనముతో గ్రహించగల సేమిత పరిధి ప్రతి గొప్ప కళాత్మక రచనకూ వున్నది. అయితే అది విశ్వజనీనమయిన అర్థాన్ని కూడ అందించవలసి వుంటుంది. కనుక 'ఆనంద మఠం' కూడ నిర్మాణైక్యతకై స్థానికమైన తిరుగుబాటును వ్యక్తం చేసినప్పటికీ, వివిధ రాష్ట్రాలలో అనేక జాతుల ప్రజలు నివసించే ఆధునిక భారతదేశపు, స్వాతంత్ర్య పోరాటమును గూడ చిహ్నితం చేసినది. ఆపైన, గేయం ఒక వ్యక్తినుండి మరొక వ్యక్తి అందుకొనగా పందేండ్లలో తనంతట తానే జాతీయ గీతంగా పరిణమించినది. ఈ పాటనే 1896 కాంగ్రెసు సమావేశములో భారతదేశపు ప్రముఖ కవి రవీంద్రనాథుడు పాడినాడు. [1]

తరువాతి శతాబ్దం చివరలో కర్జన్ ప్రభువు బెంగాలు విభజన చేయడం జరిగినది. వంగ విభజన రాజకీయ అశాంతిని అణచడమనే దుష్టబుద్ధితో జరిగినా, అది సరిగ్గా ఆందోళనను పునః జాగరితం చేయటమనే వ్యతిరేక ఫలితాన్నిచ్చినది. విభజన వ్యతిరేకోద్యమం, స్వదేశీ, విదేశవస్తు బహిష్కరణోద్యమాలతో చేయి కలిపి, అనతికాలంలో గాఢమై, విస్తృతమై పూర్ణ స్వరాజ్యకాంక్షతో సాగిన ఉద్ధృత

1. హేమచంద్ర బందోపాధ్యాయుని పద్యం 'రాఖీ బంధన్' సూచనానుసరంగా ఇది 1886 సమావేశంలో తొలిసారిగా పాడబడిందని కొంద రనుకోవటం జరిగింది. అయితే ఈ అభిప్రాయం ప్రామాణికమైంది కాదు; బహుశః హేమచంద్రుడు 1896 కాంగ్రెసు సమావేశం గురించే సూచించినట్లనిపిస్తుంది. ఆయన సంకలనంలో 'రాఖీ బంధన్' విక్టోరియా రాణి 50 వ వార్షికోత్సవపు (1887) 'విజయం గీతం', బంకిం చంద్రుని మృతి (1894) సందర్భములో వ్రాసిన 'విలాప గీతం' తరువాత కన్పిస్తుంది.

విప్లవంగా రూపొందినది. దీనిని గూర్చి ఒక ప్రముఖ వక్త మాటల్లో చెప్పవలె నంటే-ఇది ఒక గ్రామం నుండి మరో గ్రామానికి, ఒక పట్టణం నుండి మరో పట్టణానికి ఒక ప్రాంతమునుండీ మరో ప్రాంతానికి విస్తరించి సమస్త భారతావనిని తన చైతన్య జ్వాలలో ఊపివేసినది. స్వాతంత్ర్య సిద్ధికై తమనే అర్పించుకొన్న దేశ భక్తుల కిది యుద్ధగీత మయింది; అమరవీరులు జంకు గొంకులేని ధైర్యంతో మహిమాన్వితమయిన యీనినాదం వారి పెదవులపై ఆడుతుండగా ఉరికంబాల నెక్కినారు. స్వయంగా కవియైన అరవిందుడు ఈ ఉద్యమం ముందు వరుసలో ఉన్నవారిలో ఒకడై, యీ ఉద్యమ ప్రముఖ దిన పత్రికకు 'వందేమాతరం' అని పేరు పెట్టినాడు. ఈ పత్రికలో 1907 లో ఆయన యిట్లా వ్రాసినాడు: "ఉజ్జీవింపజేసే ఉన్నతమయిన సందేశం జాతికి లేదా మానవతకు అందించవలసి వున్నది; ఈ సందేశానికి శాబ్దకరూప మిచ్చేందుకైన వ్యక్తిని భగవంతు డెన్ను కున్నాడు. ఒక్కక్షణం మాత్రమే దృశ్యమయ్యే దివ్య సందేశాన్ని వ్యక్తపరచవలసి వున్నది; దానికై అతడి కండ్లనే అఖిలశక్తి ప్రదుడైన భగవంతుడు ముందు తెరపింపజేస్తాడు. (రచనలు, సంపుటం 17 పే. 344.)

ఈ గొప్పగేయం తన తొలి నినాదంతో రాజకీయ, ఆర్థిక, స్వాతంత్ర్య సాధనకయిన ఉద్యమాన్ని ఉత్తేజితం చేసినది. ఒక శక్తివంతుడైన, బలవంతుడైన వ్యక్తి నిద్రనుండి మేల్కొని, తన అజేయ హస్తాలను విదల్చుకొని, లేచి నిలబడటం ప్రపంచమంతా గమనించింది. పాలకులు నిర్విణ్ణులయినారంటే ఆశ్చర్యమేమీ లేదు. భారత ద్వీపకల్పంలోని ఆంగ్లేయు లందరికీ వందేమాతరం సింహస్వప్న మైనది. నినాదం రాజద్రోహ నేరానికి కారణభూత మైనది. 'ఆనందమఠా'నికి ఎటువంటి నష్టం కలుగక పోయినా వందేమాతరం బహిరంగ సభల్లో పాడడం నిషేధింప బడినది. 1905 లో జరిగిన ఆసక్తికరమైన సంఘటన — ఆకాలంలో ప్రేలడానికి సిద్ధంగా వున్న పరిస్థితిని కళ్ళకు కట్టించేటట్లు చేస్తుంది — వారణాసిలో భారత జాతీయ కాంగ్రెసు సదస్సు గోపాలకృష్ణ గోఖలే అధ్యక్షతన జరిగినది. శ్రోతల్లో టాగూరు మేనగోడలు, సాహసవంతుడూ జాతీయవాదీ అయిన రామ్‌భూజ్‌దత్ చౌధరీని ఆ మధ్యనే వివాహం చేసుకొనిన ప్రఖ్యాత గాయని సరళాదేవి కూడ

వున్నది. ఆమెను చూసిన జనం ఆమె వందేమాతరం గేయం పాడవలెనని గోల చేయడం మొదలుపెట్టినారు. సమావేశ వ్యవస్థాపకుల కది చికాకు కలిగించినది. పోలీసువారు ఇది అదునుగా తీసుకొని సమావేశాన్ని చెడగొడ్తారని వీరు భయపడి నారు. అయితే జనాన్ని అదుపులో పెట్టడం కష్టమవుతుందని గ్రహించిన అధ్యక్షుడు ప్రజలను శాంతింపజేయడానికై గేయంలో రెండు మూడు చరణాలు పాడవలెనని సరళాదేవికి తొందరగా చీటీ పంపినాడు. ఆమె తొలి చరణం పాడగానే శ్రోతలు ఆవేశంతో ఆమెను ప్రోత్సాహపరచడంతో అధ్యక్షులు అడ్డంకి చెప్తున్నా పాట పూర్తిగా పాడవలసి వచ్చినది. పోలీసులు జోక్యం చేసుకోలేదు — చేసుకునే ధైర్యం లేకపోయినది.

ప్రభుత్వం యీ విరోధ వైఖరిని సడలించలేదు. కాని వందేమాతరం పట్ల యింత వ్యతిరేకత వున్నా — పాక్షికంగా ఈ వ్యతిరేకతవల్లనే అది ప్రజలను ప్రోత్సాహపరుస్తూ, తన ప్రభావాన్ని చూపసాగినది. ఆశించినది కానప్పటికీ, దానంతటదే మార్పు వచ్చింది అపుడు. మొదటి ప్రపంచయుద్ధం ముగియడం ప్రపంచ వ్యవహారాల్లో ముఖ్యంగా భారతదేశ పరిస్థితుల్లో ఒక క్రొత్తయుగానికి నాంది పలికినట్లయినది. సామ్రాజ్యవాదపు అసలు రంగును బయటపెట్టిన జలియన్ వాలాబాగ్‌లో జరిగిన సామూహిక హత్యాకాండ తరువాత, బ్రిటిషు ప్రభుత్వాన్ని సైతాను పాలనగా బహిరంగంగా విమర్శించిన సహాయ నిరాకరణోద్యమం ఆరంభం కావడంతో వందేమాతరం మరల అగ్రశ్రేణిలో నిలిచినది. ప్రభుత్వాధికారులకు కూడ చేసింది చాలు అనిపించినది. ఇంకా గేయం, నినాదంపట్ల జోక్యం కల్పించు కోవడం వృథాప్రయాసగా వారికనిపించినది. దాంతో నిషేధం దానంతటదే మాయమయినది.

వందేమాతరం విజయవంతంగా అధికారుల శిక్షలనుండి తప్పించుకొని బయటపడితే, అది యింకా కష్టతరమైన సామ్రాజ్యవాద కుతంత్రాలతో పుట్టి పెరిగిన అంతరంగిక విద్రోహాన్ని ఎదుర్కొనవలసి వచ్చినది. తనకు వారసుగా, సాపేక్షికంగా విశిష్టుడు కాని మింటో ప్రభువు రాజప్రతినిధిగా నియమితుడైనపుడు కర్జన్, 'నా తరవాత, మింటోనా' అని తీవ్రమయిన ఆశాభంగంతో అంటాడు

కాని అగ్నిజ్వాలవంటి కర్జన్ నిర్వహించలేక గిజగిజ తన్నుకున్న కార్యం, అతి నెమ్మదిగా వ్యవహరించే మింటో సాధించగలిగినాడు. మార్లే సహాయంతో భారతీయ మితవాద రాజకీయ వర్గాన్ని సంతృప్తి పరచేందుకై కొన్ని సంస్కరణల ప్రవేశపెట్టడానికి అంగీకరించినాడు — లేక అట్లా అంగీకరించడమనే నాటకం ఆడినాడు. ప్రత్యేక నియోజక వర్గాలనే మిషతో హిందూ ముస్లింల మధ్య చీలిక తెచ్చినాడు. మరల విభజింపబడిన బెంగాలు ఏకం చేయబడినప్పటికి 'విభజించు, పాలించు' సూత్రం రెండు వర్గాలమధ్య స్పర్థలకు దారి తీసినది. ఈ స్పర్థలలో వందేమాతరంపై దాడిచేయడం ఒక కార్యక్రమమైనది. ముప్పయ్యవ దశాబ్దపు చివరిభాగంలో రాష్ట్రాలలో యేర్పడిన కాంగ్రెసు మంత్రివర్గాలు దీన్ని జాతీయ గీతంగా ఎన్నుకొన్నపుడు, ఇది అనేక దేవతారాధన కలిగిన హిందూ గీతంగా పరిగణించి, తీవ్ర ఆక్షేపణలను తెల్పడం జరిగినది. ఇంకా ఎన్నోచోట్ల ఈ చర్చల గురించి చెప్పడం జరిగినా "భారతదేశం విభజింపబడినది", 1945 (India Divided) అని రాజేంద్రప్రసాద్ వ్రాసిన పుస్తకంలో మాత్రం ఆవేశరహితంగా ఆపారుష్యపు చర్చల చరిత్ర వివరించడం జరిగినది. ఆ సమయంలో కొంతకాలం ఆయన కాంగ్రెసు అధ్యక్షుడుగా వున్నాడు. దాని ఫలితంగా 1937 కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో వందేమాతరంను జాతీయ గీతంగా అంగీకరించడం జరిగినది కాని దాని తోక కత్తిరించివేసినారు; బహిరంగసభల్లో మొదట రెండు చరణాలు మాత్రమే పాడాలె, కాని పదేండ్ల లోపల మళ్ళీ బెంగాలు విభజింపబడవలెనన్న ప్రణాళిక పునరుజ్జీవింప జేయబడినది. మళ్ళీ విభజన 'నిర్ణయింపబడిన సత్య' మయింది. గొప్ప వ్యంగ్య ప్రవచన కర్తయైన చరిత్ర చివరినవ్వు నవ్వినది; 1947 లో జరిగిన దేశవిభజనతోపాటుగా, 1905 లో బెంగాలు విభజనతో కర్జను ప్రభువు స్థిరీకరింప జూపిన బ్రిటిషు సామ్రాజ్యం భారతదేశంలో అస్తమించినది.

స్వతంత్ర భారతదేశంలో టాగూరు వ్రాసిన 'జనగణమన' — వాద్య బృందం వాయించే సౌలభ్యం కోసం — పాక్షికంగా వేర్పాటు ధోరణుల నను యరప జేయడానికి — ప్రభుత్వ మంగీకరించిన జాతీయగీతమైనది. కాని వందేమాతరం దేశవాసుల హృదయాలలో ఎంతగా పాతుకపోయినదంటే, దానిని ఏక

లించడం దుస్సాధ్యమైనది. అందువలన అది సహాయక జాతీయగీతముగా అంగీక రింపబడినది. అప్పటినుండి మూడు దశాబ్దాలు గడచిపోయినవి. అనాటి కణకణ మండే వివాదపు కాష్ఠాలు చల్లారిపోయినవి. ఇప్పుడు మనం మత్సరగ్రస్తంకాని మనసుతో వందేమాతరం కవిత్వ గుణాలను, అది ప్రజల నాకర్షించిన విధమును పునః పరిశీలించవచ్చును. 'జనగణమన' శ్రావ్యమైనదీ, మధురమైనదీ అయిన చక్కని గేయం; అ ే భారత జాతీయతా సజీవచిత్రాలను ప్రతిపాదిస్తుంది. గేయంపట్ల, కవిపట్ల సంపూర్ణ గౌరవభావంతో ఒక విషయం మాత్రం చెప్పాలె. వందేమాతరం కున్న శక్తి, ఉజ్జ్వలత, దాని చారిత్రాత్మక సాన్నిహిత్యము "జనగణమన" కు లేదు. నిజంగా వేర్పాటువాదుల ఆక్షేపణలను నిశితంగా పరిశీలించితే జాతీయ గీతంగా అన్నిటిని అధిగమించే మంచి లక్షణాలలో, ఇవీ ఒక భాగంగా మనకు గోచరమవుతుంది. వందేమాతరం అనేక దేవతారాధనను - ముఖ్యంగా హిందూ దేవగణాన్ని గూర్చిన ప్రస్తావన చేయడంవల్ల, ఎన్నో జాతులు, పలు మతావలం బులు నివసించే భారతావనికి అది జాతీయ గీతం కావడానికి వీలు లేదని అనడం జరిగినది. అటువంటి భావం పైపై చదువులవల్ల వచ్చేదీనూ, ఆకారణంగా తప్పు దారి పట్టించేదీను.

కవిత్వ పరంగా, ఆదర్శపరంగా వందేమాతరం ప్రధాన ఆకర్షణ అది మాతను అంతర్లీనమైనదిగా, అంతుల దాటిపోయేదానిగా దర్శింపజేయడమే. కార్డుస్సీ వ్రాసిన క్లిటమ్నస్ గీతం (Carducci's 'Ode on the Clitumnus') వంటి పద్యాలకూ దీనికీ అవిధంగా చాల భేదమున్నది. క్లిటమ్నస్ గీతంలో — ఇటాలియా — ఆ భూమి, ఆ దేశచరిత్రతో సాన్నిహిత్యం పొందినప్పటికీ, అక్కడా ప్రాచీన దేవతల ప్రసక్తి జరిగినా, ఆ గేయం లౌకికమైన పరిధులను సామాన్యంగా దాటివెళ్ళదు. టాగూరు 'జనగణమన'తో పాటు యింకా అటువంటి రచనలతో వందేమాతరంతో యిదేవిధంగా భేదిస్తుంది. ఈ గేయంలో భారతదేశమును, దాని భాగ్యవిధాత అయిన భగవంతునికి, లేక భారతావనితోపాటు, యితర దేశాలలో కూడ తన అధీనములో త్రిప్పే అమరరథాధి నాయకునికి లోబడి వర్తించేటట్లు వర్ణించడం జరిగినది. అయితే వందేమాతరం గేయంలో ప్రసక్తమయిన దేవతలు.

బహుముఖ వ్యక్తిత్వం కల తల్లియొక్క భిన్నరూపాలు మాత్రమే. నా మిత్రుడు యన్. సి. ఎమ్.[1] ఈ గేయంలో వెల్లడి చేసిన అభిప్రాయాలవంటి అభిప్రాయాలు కలిగిన ఒక రహస్య సంఘమును నా దృష్టిని తెచ్చినాడు. పందొమ్మిదో శతాబ్దపు తొలిదశలో, ఇటలీదేశపు ఏకీకరణకై స్వాతంత్ర్యానికై ఈ సంఘం పోరాడినట్లు నాకు తెలిపినాడు. ఈ రహస్య సంఘపు ఆదర్శాలలో, విశ్వాసాలలో యీ అభిప్రాయం ప్రతిబింబిస్తుంది. పేరే విగ్రహారాధనను గుర్తుకు తెచ్చేటట్లుగా వున్నది. డెల్ఫీ పూజారి, దేశభక్తుడయిన పూజారి, యుద్ధోన్మాదియైన పూజారి యిట్లా అన్నాడు: — "మాతల్లి సముద్రమే వసనముగా గలది. ఉన్నత పర్వత పంక్తులే ఆమె రాజదండము." నీతల్లి ఎవరని అడిగినప్పుడు అతడిట్లా సమాధాన మిచ్చినాడు. "ఆమె నీల కుంతల; వరదాయిని, సౌందర్యానికీ, జ్ఞానానికీ, యింతకు ముందుదాక బలానికీ ఆమె ఆలవాలం. ఆమె సంపత్తి పచ్చని ఉద్యానవనం. ఆ ఉద్యానవనంలో పుష్పాలు సుగంధ సౌరభాలను వెదజల్లుతూ వుంటవి. ఆలివ్ చెట్లూ, ద్రాక్ష తీగెలూ శోభను గూర్చుతూ వుంటవి. కానీ ఇప్పుడు ఆమె గుండెల్లో బాకు దిగబడి మూలుగుతోంది." సి. డబ్ల్యు. హెక్‌థారన్ వ్రాసిన "అన్ని కాలాల్లోని, అన్ని దేశాల్లోని రహస్య సంఘాలు" లండను, 1897, సంపుటం 2 పే. 188 **(The Secret Societies of All ages and Countries by C. W. Heckethorn, London, 1897 Vol. II, P. 188).** ఆనందమఠంలో ప్రధానవ్యక్తి అయిన సత్యానందుడు, దేశభక్తి పూరితుడయిన పూజారి, యుద్ధోన్మాదియైన పూజారి, అతడే తల్లి బొమ్మలకు - ఇదివరకెట్లా వున్నదో, ఇప్పుడెట్లా వున్నదీ, ఇకముం దెట్లావుంటుందో - రూపకల్పన చేసినాడు. ఉన్నత సృజనాత్మక కళాకారుడైన బంకించంద్రుడు సర్వదిక్కులకూ తన కౌతూహల పూర్ణ దృష్టిని ప్రసరింపజేసే అగాధ పాండిత్యము కలిగిన పండితుడు. ఆయన ఎట్లాగయినా ఈ డెల్ఫీ సంఘాన్ని గురించి తెలుసుకున్నాడా ?

---

1. యన్. సి. ఎమ్. (N. C. M.) వ్రాసిన "చిత్రాలు, జ్ఞాపకాలు" (1975) "(Portraits and Memories)" చూడండి.

# గేయం

'వందే మాతరం' గేయం తనంతటతానే పాఠకుల, శ్రోతల దృష్టి నాకర్షిస్తుంది. సుబోధ చంద్రసెన్ గుప్త ఆంగ్లంలో వ్రాసిన తన పుస్తకాని కనుబంధంగా వందేమాతరం గేయానికి శ్రీ అరవిందులు చేసిన ఆంగ్ల వచ నానువాదాన్ని ఇచ్చినారు. అయితే అది తెలుగులోకి అనువదించడం అనవ సరం. సెన్ గుప్తానే "మూలంలోని సౌందర్యాన్ని ఏ అనువాదాలు పునః సృష్టి చేయలేవని" అన్నారు. అపైని బెంగాలీ, తెలుగు భాషలు రెండూ సంస్కృత శబ్దమయం కావడంవలన బెంగాలీ 'వందే మాతరం' గేయం తెలుగు గేయమే అన్న భ్రాంతిని కలిగిస్తుంది. అందువల్ల తెలుగు చేయవలెనని సాహస ప్రయత్నం చేయలేదు. బంకించంద్రుడు వ్రాసిన గేయం యథా తథంగా క్రింద యీయ నైనది.

—అనువాదకుడు

## వందే మాతరం

వందే మాతరం, వందే మాతరం
సుజలాం – సుఫలాం
మలయజ – శీతలాం
సస్యశ్యామలాం – మాతరం
వందే మాతరం,

శుభ్ర జ్యోత్స్నా పులకిత యామినీం,
పుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం.
సుహాసినీం – సుమధుర భాషిణీం
సుఖదాం – వరదాం.
మాతరం – వందే మాతరం

# బంకించంద్రుని కృతులు

1. లలిత ఓ మానస్ — కావ్యకవిత్వం 1856
2. దుర్గేశనందిని — నవల 1865
3 కపాలకుండల — నవల 1866
4. మృణాళిని — నవల 1869
5. విషవృక్షం — నవల 1873
6. ఇందిర — నవల 1873
7. జుగలుంగరీయా (ఉంగరద్వయం) — నవల 1874
8. లోకరహస్య — వినోదరేఖాచిత్రముల సంకలనం, 1874
9. విజ్ఞాన రహస్య — విజ్ఞాన శాస్త్రంపై వ్యాసముల సంకలనం 1875
10. చంద్రశేఖర్ — నవల 1875
11. రాధారాణి — నవల 1875
12 కమలా కాంతేర్ దప్తార్ (కమలాకాంతుని పత్రములు) — 1875
13. వివిధ సింహాలోచన (కలగూరగంప విమర్శలు) వ్యాసములు— 1876
14. రజని — నవల 1877
15 కృష్ణ కాంతేర్ విల్ (కృష్ణకాంతుని వీలునామా) — నవల 1878
16. కవితాపుస్తక్ — పద్యములు 1878
17. సామ్య (సమానత్వము) — వ్యాససంకలనము 1879
18. ప్రబంధపుస్తక్ (వ్యాససంపుటి) — వ్యాసములు 1879
19. రాజసింహ — నవల 1882
20. ఆనంద మఠ్ — నవల 1882
21. ముచిరామ్ గురేర్ జీబన్ చరిత్ (ముచీరామ్ జీవిత చరిత్ర)— వ్యంగ్య రచన 1884
22. దేవి చౌధురాణి — నవల 1884
23. కృష్ణ చరిత్ర — వ్యాసము 1886
24. సీతారాం — నవల 1887

25. వివిధ ప్రబంధ (వివిధ వ్యాసములు) — మొదటిభాగమువ్యాసము, 1887
26. ధర్మతత్త్వ, మొదటి భాగము — అనుశీలన్ (సంస్కృతి) 1888
27. వివిధ ప్రబంధ (వివిధ వ్యాసములు) — రెండవ భాగము 1892
28, సహజ్ రచనా శిక్ష — పాఠ్యగ్రంథము, రెండవ ప్రతి 1894
29. సహజ్ అంగ్రేజ్ శిక్ష — పాఠ్యగ్రంథము, మూడవ ప్రతి 1894
దీని ప్రతు లేవీ దొరకలేదు.
30. శ్రీమద్ భగవద్గీత — గీత అనువాద తాత్పర్యములు, అసంపూర్ణం 1902 లో ఆయన మరణించిన తరువాత ప్రచురింపబడినది.
31. రాజమోహన్స్ వైఫ్ — ఆంగ్ల నవల 'ఇండియన్ ఫీల్డ్' పత్రికలో 1864 లో ధారావాహికముగా ప్రకటింపబడినది. 1935 లో పుస్తక రూపమున మొదటిసారిగా వెలువడినది.